


ప్రకృతి ఉగాది ఉత్సవ కార్యక్రమ భాగస్వాములు 14 సంఘాల ప్రతినిధులు

పాపినేని శివశంకర్

పెనుగొండ లక్ష్మీనారాయణ



జి. విజయం

టి. శ్రీకుమార్

చల్లా రవికుమార్

పి. మురళీకృష్ణ

బుడిగ జమిందార్

నార్నె వెంకటసుబ్బయ్య



మందరపు హైమవతి

రావెళ్ళ శ్రీనివాసరావు

అనిల్ డ్యాని

ఎరుకలపూడి గోపినాథ్‌రావు

శ్రీరాం

ఉమా మహేశ్వరి

బెందాళం కృష్ణారావు

చిత్తలూరి సత్యనారాయన

కట్టా సిద్ధార్థ

**మార్చి29న విజయవాడలోని ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జరిగిన ప్రకృతి ఉగాది ఉత్సవం సందర్భంగా అభ్యుదయ, శాస్త్రీయ, నాస్తిక, హేతువాద సమ్మేళనం దృశ్యాలు. సందేశాలు, కవి సమ్మేళనం, హాస్య నాటిక, పాటలు, నృత్యాలు, వినూత్న రీతిలో ఉగాది ఉత్సవం**



మాతంగి దిలీప్ కుమార్

కె.ఎస్. రాజు

కార్యక్రమాన్ని సమన్వయం చేసిన డా॥ శమంతకమణి, శాంతిశ్రీ, అంజుశ్రీ




ప్రజానాట్యమండలి కళాకారుల గేయాలాపన




వీర గంగాధర్ రచన, దర్శకత్వం వహించిన 'రాజపూజ్యం 3: అవమానం 18' హాస్యనాటిక దృశ్యం



PRSVMO2A180

సాహిత్య
ప్రస్థానం
మే 2017
సంపుటి : 16 సంచిక : 5

# ప్రజాసాహిత్య బాహుబలం

రాజమౌళి బాహుబలి అసాధారణ విజయం అందరి అభినందనలు చూరగొంటున్న సందర్భం. ఆధునిక సాంకేతిక ప్రక్రియలను అతిభారీ పెట్టుబడులను సమీకరించి జానపదాన్ని మేళవించి ఆయన చేసిన పెద్ద ప్రయత్నాన్ని ప్రజలు ఆదరించారు. తెలుగుదర్శకుడు ఇంత పెద్ద విజయం సాధించినందుకు సంతోషించుదాం. ఈ విజయం మన సమాజంలో కళల పట్ల వున్న ఆదరాభిమానాలను ప్రతిబింబించింది. కృషిని వెన్నుతట్టేందుకు ప్రజలెప్పుడూ సిద్ధంగా వుంటారని రుజువు చేసింది. బాహుబలి కథ, కథనం కట్టప్ప వంటి వివిధాంశాలపై విశ్లేషణలు జరుగుతూనే వున్నాయి. అంతకంటే ముఖ్యమైంది నవీన యుగంలో కళా సాహిత్యకారులు విజృంభించేందుకు విస్తారమైన అవకాశాలున్నాయన్న సత్యాన్ని గుర్తించడం ఇక్కడ ముఖ్యమైన సందేశం. బాహుబలికి వున్న భారీ పెట్టుబడులు, మార్కెట్ మంత్రాలు లేకపోయినా ప్రజా కళలూ సాహిత్యం అంతకు అనేక రెట్లు బ్రహ్మాండమైనవి. వాణిజ్య కోణంలో ఒక కథకుడు దర్శకుడు వారి బృందం చేసిన దానికే ఇంత ప్రతిస్పందన వస్తే కోట్ల మంది ప్రజలకోసం ప్రత్యామ్నాయ ప్రగతి శీల రచయితలు కళాకారులు మరెంత శ్రమ పడాలి? మరెంత వినూత్నంగా ఆలోచించాలి? శత సహస్ర హస్తాలతో నేత్రాలతో చైతన్య ధారతో వీరు చేసే కృషి మరెంత పెద్ద ఎత్తున నడవాలి? ఎంతటి స్పందన తీసుకురావాలి? ఇవన్నీ మనం ఆలోచించాల్సిన విషయాలు. ప్రజా కళాకారులూ రచయితలూ ఆ విధమైన వినూత్న విశాల కృషికి నాంది పలకాల్సి వుంది. దేశంలో వివిధ రకాల విద్వేషాలు, ప్రపంచీకరణ తెచ్చిపెట్టిన ప్రమాదాలూ ప్రజలను పిప్పి చేస్తున్న నేపథ్యంలో అత్యంత అప్రమత్తంగానే గాక బాధ్యతగా కళాక్షర సృజన చేసి ఈ సవాళ్లను సమర్థంగా ఎదుర్కోవలసి వుంది. సాహిత్య ప్రస్థానం ఆ దిశలో వినూత్నమైన వివిధ రకాల రచనలను ఆహ్వానిస్తున్నది. కొత్తదనం, పరిశీలన, నాణ్యత మేళవించిన కవితలు కథలే గాక ఇతర విశ్లేషణాత్మక అంశాలకు కూడా పెద్ద పీట వేస్తుంది. అవసరమైతే అందుకోసం కార్యగోష్టులూ శిక్షణ తరగతులూ నిర్వహించి తర్ఫీదు నిస్తుంది. ఇందుకు శ్రేయోభిలాషుల సహకారాన్ని, కవులు రచయితల భాగస్వామ్యాన్ని ఆహ్వానిస్తున్నాం. వాణిజ్య బాహుబలికి దీటుగా ప్రజాకళల నుంచి ప్రత్నామ్నాయ భావబలం చూపించాలి.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్

## ఈ సంచికలో ...





మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం,
డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## పిచ్చిమాలోకం

It's a mad mad mad world



- కడియాల రామమోహనరాయ్
9959778698

ప్రేమా పిచ్చీ వొకటేనంటాడు మా పిచ్చేశ్వరరావు
ప్రేమ పెళ్ళిలో కలిసిపోతుందంటుంది ప్రియాంక
వాళ్ళిద్దరు వాళ్ళకిద్దరు
ప్రేమ, వెంగళ్
వద్దన్నా వినకుండా వాళ్ళ నాన్న పేరే
పెట్టుకున్నాడు పిచ్చేశ్వర్
అక్కాతమ్ముళ్ళకు ఒక్కక్షణం పడదు
నీవన్నీ పిచ్చిపనులంటుంది ప్రేమ
నీవన్నీ తిక్క పనులంటాడు వెంగళ్
ఐపాడ్ - టేబ్లెట్ ఎవరి దగ్గర వుండాలనటంలో
ఎడతెగని పేచీ
ఒకరితోవొకరు పోట్లాటేగాని మాట్లాడుకోరు
ఒకరి ఫేస్ మరొకరు చూడరు
ప్రియాంక పిచ్చేశ్వర్ కూడా అంతే
ఎవరి లోకం వారిది ఎవరి ధోరణివారిది
పిల్లల తగవులు తీర్చలేక పిచ్చెత్తిపోతున్నారు
పిచ్చాటూర్‌లో వాళ్ళ ఇల్లొక పిచ్చాసుపత్రి
డాక్టర్ కావాలి పిల్లలకేకాదు
పెద్దల క్కూడా

❋

## మాట



- మొగిలి స్వామిరాజ్
9963642205

గొంతు పెగలని మాట
గుండెగదిలో అరుస్తుంది
కరుస్తుంది, చరుస్తుంది
నిరాశ నిస్పృహలతో నిట్టూరుస్తుంది

ఓ చోట మాటే మంత్రం
ఇంకోచోట మాటే శరాగాత్రం
మాటను శిరస్సావహించే సైనికులెందరో....
శిరచ్ఛేదనం చేసే దుండగులెందరో.....
అర్థంకాని, చేసుకోలేని అనామకులెందరో....
ఆవేదనతో ఈటై విసిరినమాట
ఎవరి గుండెనో పేల్చడానికి గురిపెట్టిన తూటా
వాక్ ప్రవాహంలో బయల్పడిన మాట
నిఖచ్చిగ వాస్తవాల ఊట
జీర్ణించుకోలేని అర్భకులకు కంటగింపు
సమాధి స్థితితో ముగింపు

మాట ముగిసిపోయిందనుకోకు
వేనవేల హృదయాలు ప్రశ్నించే అస్త్రాలై
కుళ్ళిన మెదళ్ళకు శస్త్ర చికిత్స చేస్తాయి.

❋

### ఏప్రిల్ నెల పురస్కారాలు

**బొగ్గులబట్టి**
కథకు: రూ.700/-
రచయిత : భారతి

**ఉగాది పిలుపు**
కవితకు : రూ .500/-
రచయిత
: కొల్లూరు మురళీ కుమారి

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారాల చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని
ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# కొత్త నీరొచ్చింది...



- అంపశయ్య నవీన్
9989291299

"పెద్దనోట్ల రద్దు ప్రభావం ఎలా ఉంటుందంటారు?" నల్లగొండ నుండి సూర్యాపేటకు వెళ్తున్న నన్ను బస్సులో నా పక్క సీట్లోనే కూర్చున్న ఓ ప్రయాణీకుడు అడిగాడు.

నేనతనివేపు తిరిగి అతణ్ణి పరిశీలనగా చూశాను.

నాలాగే అతడూ మధ్య వయస్కుడు. తెల్లటి ధోవతి, తెల్లటి చొక్కాతో చాలా ఆకర్షణీయంగానే కనిపించాడు. ఛామనఛాయ, చురుకైన కళ్ళు, అక్కడక్కడ నెరుస్తున్న వెండ్రుకలు... నడిమి పాపట తీసి పైకి దువ్వుకున్నాడు. బహుశా వ్యవసాయదారుడు అయ్యుంటాడు అనుకున్నాను.

"పెద్దనోట్లను రద్దు చేస్తున్నానని మన ప్రధానమంత్రి ప్రకటించినప్పుడు దేశ ప్రజలంతా గొప్ప దిగ్భ్రాంతికి గురయ్యారు. దేశంలో విపరీతంగా పేరుకుపోయిన నల్లధనాన్ని వెలికితీయటం కోసం ఈ చర్య తీసుకున్నామని, దీనివల్ల అన్నీ సత్ఫలితాలే ఉంటాయని మన ప్రధాని చెప్పారు. నిజమే... దేశంలో హద్దూ అదుపూ లేకుండా పెరిగిపోతున్న నల్లధనాన్ని వెలికితీయటానికి ఈ చర్య తోడ్పడుతుందనటంలో సందేహం లేదు. కానీ..." నామాట పూర్తి కాకుండానే అతడు "అసలీ నల్లధనం అంటే యేమిటండి?" అని అడిగాడతడు.

"ప్రభుత్వ దృష్టికి రాకుండా... ముఖ్యంగా ఆదాయపు పన్ను వసూలు చేసే అధికారుల దృష్టికి రాకుండా చెలామణి అయ్యే డబ్బును నల్లధనం అంటారు. ఉదాహరణకు మీరో వ్యాపారం చేస్తూ లక్షలు సంపాదిస్తున్నా రనుకొండి, మీ సంపాదన 20 లక్షలనుకొండి, కానీ మీరు మీ ఆదాయం 5 లక్షలని చూపించి, ఆ ఐదులక్షలకే ఆదాయపు పన్ను కడ్తారనుకొండి, మిగతా 15 లక్షల్ని ప్రభుత్వం దృష్టికి రాకుండా దాచేసుకుంటారనుకొండి, అప్పుడా 15 లక్షలు నల్లధనం అవుతుంది. ఒక్క ప్రభుత్వోద్యోగుల ఆదాయం తప్ప వ్యాపారస్తులు, డాక్టర్లు, సినిమావాళ్ళు- వీళ్ళ ఆదాయాలు ఎంతో వాళ్ళకు తప్ప వేరేవాళ్ళకు తెలీదు. ఈ వర్గాల వాళ్ళ దగ్గరే నల్లధనం పెద్ద మొత్తంలో ఉంటుంది"

"మరి ఈ నోట్ల రద్దు వల్ల ఈ నల్లధనం ఎలా బయటకు వస్తుందంటారు" అడిగాడాయన.

"మీరా 15 లక్షల్ని 500 రూపాయల నోట్ల రూపంలోనో, వెయ్యి రూపాయల నోట్ల రూపంలోనో దాచేసుకుంటారు కదా! ఇప్పుడవి చెల్లవు కదా! వాటిని మీరు బ్యాంకులకు తీసికెళ్ళి ఇప్పుడు జారీ అవుతున్న కొత్త నోట్లలోకి

మార్చుకుంటారు కదా! అప్పుడు ప్రభుత్వానికి మీ దగ్గర ఎంత నల్లధనం ఉందో తెలిసిపోతుంది కదా... అప్పుడు మీ దగ్గరున్న ఆ నల్లధనం మీద పన్ను వేసి వసూలు చేస్తారు"



"అయితే నాదో డౌట్... నేనా పదిహేను లక్షల్ని నగదు రూపంలోనే దాచుకుంటానన్న గ్యారంటీ యేమిటి? బంగారం రూపంలోనో, మరే రూపంలోనో దాచుకోవచ్చు కదా..."

"అవును... ఎంత బంగారం రూపంలో దాచుకున్నా యే సమయం ఎలా వస్తుందోనని చాలామంది నగదు రూపంలోనే ఎక్కువగా దాచుకునే అవకాశం ఉంది. పెద్దనోట్లను రద్దు చేస్తున్నారన్న విషయం అకస్మాత్తుగా, ఎవరికీ ముందస్తుగా తెలియకుండా జరుగుతుంది కాబట్టి పూర్తిగా కాకపోయినా చాలావరకు నల్లధనాన్ని బయటకు తీసే అవకాశం కల్గుతుందనే అనుకుంటున్నాను..."

"ఈ పెద్దనోట్ల రద్దు వల్ల వేలవేల కోట్ల ఆస్తులున్న బడా వ్యాపారుల దగ్గరి మీరన్న నల్లధనం నిజంగా బయట పడ్తుందంటారా? అలా బయటపడ్తున్న వార్తలేవీ రావడం లేదుకదా! పెద్దనోట్లను రద్దు చెయ్యబోతున్నారన్న వార్త నెలరోజులకు ముందే దేశంలోని చాలామంది బడాబాబులకు తెలిసిపోయిందని, వాళ్ళు ముందే జాగ్రత్త పడి వాళ్ళ దగ్గరున్న నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకున్నారని చాలామంది చెప్పుకుంటోంటే విన్నాను..."

పైకి అమాయకంగా, యేమీ తెలియనట్టు కనిపించాడే గానీ ఇతనికి చాలా విషయాలు తెలిసినట్టుందే... అనుకున్నాను.

"అలాంటి వార్తలు నేనూ విన్నాను. కానీ అవి నిజమో కాదో నేను చెప్పలేను..." అన్నాను.

"కోటీశ్వరులకు తప్ప సామాన్యులకెవరికీ ఈ చర్య వల్ల ఎలాంటి ఇబ్బందులు కల్గవని ప్రధానమంత్రి గారు పదేపదే చెప్తున్నది నిజమేనంటారా?" అడిగాడతడు.

"సామాన్యులకు, పేదవాళ్ళకు... దినసరి కూలీలకు కూడా ఇబ్బందులుండొచ్చునని రోజూ బ్యాంకుల ముందున్న క్యూలను చూస్తే తెలిసిపోతూనే ఉంది. మన దేశంలో నూటికి 90 పాళ్ళు ఆర్థిక వ్యవహారాలన్నీ నగదు రూపంలోనే జరుగుతాయి. అభివృద్ధి చెందిన దేశాల్లో లాగా చెక్కుల రూపంలోనో, క్రెడిట్ లేక డెబిట్ కార్డుల రూపంలోనో, ఆన్‌లైన్ చెల్లింపుల రూపంలోనో జరగవు. దేనికైనా నగదే కావాలి కదా... పాత నోట్లను కొత్త నోట్లుగా మార్చుకోవటానికి సామాన్య ప్రజలు వాళ్ళ బ్యాంకుల ముందు పెద్దపెద్ద క్యూల ముందు నిల్చోవలసి వస్తున్నది... బ్యాంకుల్లో ఈ చెల్లింపులు చాలా ఆలస్యంగా జరుగుతున్నాయి. తగినన్ని కొత్త నోట్ల ముద్రణ కూడా జరగకపోవడం వల్ల కొద్దిసేపట్లో క్యాష్ అయిపోయిందని బ్యాంకు అధికారులు చెబుతున్నారు. ఏటియంలలో కూడా తగినంత క్యాష్ ఉండటం లేదు..."

మేమిద్దరం ఇలా మాట్లాడుకుంటుండగానే ఒక గ్రామంలోని బస్‌స్టాప్ దగ్గర బస్సు ఆగింది. ఐదారుగురు ప్రయాణీకులు– వారిలో ముగ్గురు పురుషులు... ఇద్దరు స్త్రీలు – బస్సెక్కారు. కండక్టర్ వాళ్ళ దగ్గర డబ్బులు తీసుకొని టికెట్టు ఇవ్వడం మొదలెట్టాడు. బస్సెక్కిన ఇద్దరు స్త్రీలలో ఒకామె కొత్తగా ముద్రించబడిన రెండువేల రూపాయల నోటును కండక్టర్ చేతికిచ్చి "నకిరేకల్లుకు టికెట్ ఇవ్వు" అంది.

ఆ రెండు వేల రూపాయల నోటును తిరిగి ఆమె చేతికే ఇస్తూ "చిల్లర లేదు. చిల్లరిచ్చి టికెట్ తీస్కో" అన్నాడు కోపంగా కండక్టర్.

"నా దగ్గర ఈ రెండువేల నోటు తప్ప వేరే ఒక్క పైసాకూడా లేదు" అందామె తిరిగి ఆ నోటును కండక్టర్ చేతికివ్వబోతూ.

"అయితే బస్సు దిగు" అరచినట్టుగా అన్నాడు కండక్టర్.

"బస్సెందుకు దిగుత... నేనేమన్న నీకు చెల్లని నోటిచ్చిన్నా? కొత్తనోటు... గిప్పుడే మా ఆయన మార్కెట్ల పెసల్లమ్మితే గీ నోటిచ్చింండ్రు... మా పిల్లాడ్ని నకిరేకల్లులో ఓ ప్రైవేట్ స్కూల్ళో చేర్పించినం... హాస్టల్ల ఉంచి చదివిస్తున్నం... వాడికివ్వాళ్ళ లేచినప్పట్నించి వాంతులు, విరేచనాలు పెడ్తున్నాయని హాస్టలోళ్ళు మా ఆయనకు ఫోన్ చేసి చెప్పింండ్రు. వాన్ని చూసేటందుకు పోతాన్న... మా ఆయన నాకీ ఎర్రనోటే చేతులపెట్టి "జల్దీపో... అగో... బస్సుకూడా వస్తున్న"దని గీ బస్సును చూపెట్టిండు. నేను ఆదరాబాదరా గీ బస్సు పోతే మళ్ళీ బస్సు ఎప్పుడొస్తుందో అని ఉరుక్కుంటొచ్చిన..." అందామె.

"బాగానే వచ్చినవుగని నీకు టికెట్ ఇచ్చేటందుకు నా దగ్గర చిల్లర లేదు. మర్యాదగ చెప్తున్న... ఈ బస్సు దిగి వేరే బస్సుల రాపో..." అన్నాడు కండక్టర్.

"వేరే బస్సులో కూడా నీలెక్క చిల్లర లేదంటడు. గప్పుడు నేనేం చెయ్యాలె..." అందామె.

"యేం చెయ్యాల్నో నన్నడిగితే నేనేం చెయ్యాలే... గంగల గలువు. మర్యాదగా బస్సు దిగుతవా? లేక మెడలు పట్టి గెంటెయ్యమంటవా?" అన్నాడు కండక్టర్ పరమ చిరాగ్గా.



"మెడలు బట్టి గెంటేస్తవా? యేది గెంటెయ్యి చూస్త... నా వంటి మీద చెయ్యేస్తివో... జైలుకు బోతవు బిడ్డా...!" అందామె కోపోద్రిక్తురాలైపోయి.

ఆమె ఆ మాట అనడంతో అందరం ఆమె కేసి చూశాం... ఆమెకు ముప్పయ్యేళ్ళుంటాయనిపించింది. ఆమె వేసుకున్న డ్రెస్ చూస్తే ఓ దిగువ మధ్యతరగతికి చెందిన మర్యాదస్తుల కుటుంబానికి చెందిన స్త్రీలాగే కనిపించింది. కాస్త అందంగా కూడా కనిపించిందామె.

"జైల్ల పెట్టిస్తవా? ఎన్ని గుండెలే నీకు... జైల్ల నీకెవడన్న ఉన్నడాయేంది? వానితోటి జెప్పి జైల్లబెట్టిస్త ననుకుంటున్నవా? నిన్నే ఇప్పుడు పోలీసు స్టేషన్‌కు తీసుకపోయి లాకప్‌ల పెట్టిస్త... యేమనుకుంటున్నవో... ఎర్రగా, బుర్రగా ఉన్నానని నేనేం చేసినా అడిగెటోడుండడని అనుకుంటున్నవా? డ్రైవర్‌సాబ్! బండిని ఇక్కడికి దగ్గర్లో ఉన్న యేదన్న పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్ళు" అంటూ కండక్టర్ డ్రైవర్‌కు చెప్పాడు.

పోలీసు స్టేషన్ అన్నమాట వినగానే బస్సులోని ప్రయాణీకులందరూ హాహాకారాలు చేశారు.

"గింత మాత్రానికి పోలీసుస్టేషన్ దాకా ఎందుకు? మాకు సూర్యాపేటలో అర్జెంట్ పనులున్నయి... ఆయన చిల్లర లేదంటున్నడు కదా... ఇంతమందికి ఇబ్బందెందుకు కల్గిస్తవు తల్లీ! బస్సు దిగి వేరే బస్సు చూస్కో తల్లీ" అన్నాడో ప్రయాణీకుడు లేచి నిల్చొని.

"వేరే బస్సోడు కూడా గిట్లనే చిల్లర లేదంటడు సారూ! అప్పుడు నేనెక్కడ బోవాలె? గీ గవర్నమెంటోడు పాడుగాను... వానిమీద మన్నుబొయ్య.... పాతనోట్లను రద్దు చేసి చిన్నచిన్న నోట్లియ్యక గీ రెండువేల నోట్లే ఇచ్చె... ఎవర్ని అడిగినా చిల్లర లేదు అనబట్టిరి... మా పిల్లగాడికి వాంతులు... వీరేచనాలాయె... అర్జెంట్‌గ పోవాల్నని గీ బస్సెక్కితిని... గీయనేమో 'చిల్లరలేదు... దిగిపో' అంటుండె... దిగకపోతే గీ మొనగాడు మెడలు బట్టి గెంటేస్తడట... కండక్టర్‌గిరి చేస్తున్నని ఎంత పొగరు! ప్రయాణీకుల తోటి మర్యాదగ మాట్లాడటం వీళ్ళెప్పుడు నేర్చుకుంటరు?..." అందామె.

"నేర్చుకుంటంగని నువ్వైతే మొదలు బస్సు దిగు..." అన్నాడు కండక్టర్.

"బస్సులో ఉన్న ఎవరిదగ్గరైనా రెండువేల రూపాయల చిల్లరుంటే, పాపం, ఆమెకివ్వండి. నా దగ్గర కూడా రెండువేల నోట్లే తప్ప చిల్లరలేదు" అన్నాను నేను లేచి నిల్చొని.

అందరూ మా దగ్గర లేదంటే మా దగ్గర లేదన్నారు.

"ఇక చేసేదేమీ లేదు. ఆమె దిగిపోవాల్సిందే..." అన్నాడు ఇంతకు ముందు మాకు సూర్యాపేటలో అర్జెంట్ పనుందని చెప్పిన ప్రయాణీకుడు.

"నన్ను చంపినా దిగిపోను... నేను దిగిపోతే అక్కడ నా కొడుకు చచ్చిపోతడు" అందామె కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

"కండక్టర్ గారూ! ఒక పని చెయ్యండి. బస్సును పోలీసు స్టేషన్‌కు బదులు యేదన్నా బ్యాంకుకు తీసికెళ్ళండి. బ్యాంకువాళ్ళను బతిమాలో, బామాలో చిల్లర తీసుకుందాం" అన్నాడు నా పక్కన కూర్చున్న ప్రయాణీకుడు.

"మీరు భలే చెప్పిండ్రు సార్... ఇంకా నయం... ప్రధానమంత్రి మోదీగారి దగ్గరికే తీసికెళ్ళమనలేదు... బస్సు యే బ్యాంకు దగ్గరకు వెళ్ళదు... యే బ్యాంకుకు వెళ్ళినా జనం క్యాష్ కోసం కొట్టుకు చస్తున్నరు. మనకెవడిస్తడు... మర్యాదగా ఆమెనే దిగిపొమ్మనండి..." అన్నాడు కండక్టర్.

బస్సులో కూర్చున్న మెజారిటీ ప్రయాణీకులు ఆమెను దిగిపొమ్మనే చెప్పారు.

"మనది ప్రజాస్వామ్యం కదా... మెజారిటీ నిన్ను దిగిపొమ్మనే అంటున్నరు... నువ్వు దిగిపోక తప్పదమ్మా!" అన్నాడు సూర్యాపేటకెళ్ళాలన్న ప్రయాణీకుడు.

"ఎందుకు దిగిపోవాలె... నేనేమన్న చెల్లని నోటిచ్చిన్నా...? దొంగనోటిచ్చిన్నా...?"

"అది నిజమేనమ్మా... నీ 70 రూపాయల టికెట్‌కు రెండువేల నోటిస్తే ఆయన మాత్రం చిల్లర ఎక్కడ్నించి తెచ్చిస్తడు చెప్పు... ఇదివరకున్న నోట్లను రద్దుచేసి ఒక్కసారే గీ రెండువేల

# ఆటవిడుపు

- సిహెచ్.వి. బృందావనరావు
9963399189



అల్లసాని పెద్దన్నో అభినవ శ్రీనాధుడో
ఒళ్లు తిమ్మిరెక్కి ఏడిచే
అందమైన అమ్మాయిల ఏడుపుల్ను
గణయతి ప్రాసల కవిత్వంతో
గమకంగా వినిపిస్తారు గాని
ఏడుపులే బతుకులైన వారి రోదనలను
ఎవరు మాత్రం ఎందుకు పట్టించుకుంటారు.
ఏడుపులే ఏకాంతనేస్తాలై
చింతల బొంతల్లోనే నిరంతరమూ
నివాసం చేస్తున్నవాళ్ళనూ
బతుకు బంజర్లచుట్టూ
విలాపాల కంచెలు కట్టుకొని
ఆగామి మీద ఆశలెరుగని
అమాయకపు ఏడుపు పొట్లాలనూ
ఏ కవి తన కవితా వస్తువుగా స్వీకరిస్తాడు.
గెలిచిన వాడిదే రాజ్యమైనాక
కొల్లగొట్టబడ్డ వాళ్ళందరూ వెళ్ళగొట్టబడ్డవాళ్ళే.
విజేతలు రాయించిన వీలునామాలు
ఏడుపొక్కట్టే గదా
చరిత్ర వాళ్ళకు మిగిల్చిన వారసత్వం
ఊర్పులే ఊపిర్లై, ఎక్కిళ్ళే చెక్కిళ్ళైన
వీరి అశ్రుసంగీతాలను
ఏ సరిగమలూ అక్కున చేర్చుకోవు.
ఊరు ఊరంతా
నవ్వుల పల్లకీ మీద ఊరేగుతుంటే
వీరి గల్లీలు మాత్రం
ఏడుపు పాటల సంపుటాలుగానే ఉండేవి
వెన్నెల దుప్పటి కప్పుకొని లోకం
వెచ్చటి కలల మీద తేలిపోతుంటే
ముడుచుకు పోయిన ముతకబొంతై వీరి వీధి
కలత కలవరింపుల ఉలికిపాటు అయ్యేది
సాంత్వనల మొసలి కన్నీళ్ళకూ
సానుభూతి ప్రకటనలకూ
సంస్కరణ ప్రదర్శనలకూ
ఉద్ధారక బిరుదావళులకూ
వీరి ఏడుపుల్నే పెట్టుబడి చేసుకున్న భద్రలోకం
ఉదారపు అనుకంపల వెనకాల
వెక్కిరింపుల వెక్కసాల్ని దాచుకుంటుంది
ఇక ఇప్పుడు ఏడుపులకే
ఏడుపొచ్చే రోజులొచ్చేశాయి.
బాధకు పర్యాయపదం కవిత్వమేగాని
బాధ తెచ్చే ఏడుపును బహిష్కరించింది కవిత్వం
కొత్తభాషనూ, కొత్త పరిభాషనూ నిర్మించుకుని
కొత్త భావాల బావుటా ఎగిరేందుకు
కొత్త పిడికిలై బిగుసుకుంటున్నది
ఏడుపులకింక శిక్ష
అవమానాల కింక ఆటవిడుపు
ఏడ్చిన ప్రతిగొంతూ
ఇప్పుడో కొత్త రవికిరణం.

❋

---

రూపాయల నోట్లనెందుకు నీలాంటివారికిస్తున్నరో గా మోదిగార్నే అడగాలి...” అన్నాడు సూర్యాపేట ప్యాసింజరు.

“గిప్పుడామెను ఢిల్లీకి పొమ్మంటరా యేంది?” అన్నాడు ఆయన పక్కనే కూర్చున్న మరో ప్యాసింజర్.

ప్రయాణీకులందరూ గొల్లున నవ్వారు.

“మీకు నవ్వులాటగానే ఉంటుంది... నా సమస్యకు పరిష్కారమేమిటో చెప్పండ్రి... పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటంలాగా ఉంది నా పరిస్థితి” అందామె.

“పరిష్కారమేం లేదు... బస్సు దిగిపోవటమే... ఇక్కడో బస్సు స్టాపుంది. ఆపుతాను. దిగవమ్మ తల్లీ!” అన్నాడు బస్సును ఆపేసిన డ్రైవర్.

“ఈ నోటిచ్చినోనింట్ల పీనుగెల్ల... వాన్ని బొందబెట్ట... అవసరానికి పనికిరాని గీ నోట్లను పెట్రోలుబోసి తగులబెట్ట... నా కొడుక్కేమన్న అయితే గీ బస్సును, గీ కండక్టర్‌ను, గీ డ్రైవర్‌ను తగులబెట్ట...” అని రకరకాల శాపనార్థాలు పెడ్తూ ఆమె బస్సు దిగి రోడ్డు పక్కనున్న మట్టిని చేతిలోకి తీసుకొని అప్పుడే స్టార్టయి కదులుతున్న బస్సు మీదకు విసిరికొట్టింది.

నోట్ల రద్దు వల్ల సామాన్యులకు ఎలాంటి ఇబ్బందులుండవు అన్న మన ప్రధాని మాట ఎంతవరకు నిజం అన్నట్టుగా నాకేసి చూశాడు నా పక్కన కూర్చున్న ప్రయాణీకుడు.

## జ్ఞాపకాలు ఘనీభవిస్తే

- వల్లభాపురం జనార్దన
8179939547



జ్ఞాపకాలు అపురూపాలు
బతుకు ఆక్సీజన్లు
మనుగడకు గనులు
జ్ఞాపకాలు ప్రవహిస్తేనే సౌందర్యం
ఘనీభవించిన జ్ఞాపకాలు
ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో లేని దేహాలు
జ్ఞాపకాలు నడిపించె సారథులు
నడక ఎంపికకు నిఘంటువులు
పడకేసిన పయనానికి ఉద్దీపన సూత్రాలు
జ్ఞాపకాల లింకు తెగితే
జీవితం దారం తెగిన గాలిపటమే
జ్ఞాపకాలు మనసు ప్రయోగశాల ఆవిష్కరణలు
జీవన ఛందస్సులు
ఘనీభవిస్తే, జీవితం శవమే, శ్మశానమే
ప్రాణ సూర్యుడు ఉదయించడు

కళ్ళకు చూపున్నా దారిని చూపలేవు
పనిచేసే చేతులున్నా దారిని చూపలేవు
బతుకు రోడ్డంతా చీకటి చీకటి
వెలుతురుకాగడా దొరుకదు
మలుపుల కాపలా హెచ్చరికలు పలుకవు
జీవిత సముద్ర మథనం జరుగదు
మథనం బాటలో హాలాహల లావలే
ప్రశాంతత కుదరదు
భద్రతకు విస్ఫోటనం
ఘనీభవించక ప్రవహించే జ్ఞాపకాలు
మానవతా పయనానికి దిక్సూచికలు
రహదార్లు
మరుపులను వెనక్కినెట్టే జ్ఞాపకాలు
జీవితానికి వసంతాలు

❋

## ఉమ్మడి కుటుంబం

- ఎస్. సుమిత్రాదేవి,
7207550867



వాళ్ళంతా ఒకే కుటుంబం కాదు
బంధువులు కూడా కాదు
తాత, మామ, బాబాయ్, పిన్ని, పెద్దమ్మ, పెద్దయ్య
అంటూ - అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ముల్లా కలసి ఉంటారు
చిన్ని చిన్న పిచ్చుక గూళ్ళలో, కష్టసుఖాల కలనేతలు,
ఏక మనస్కుల శ్రమజీవులు
కలగూరగంపలాగ విభిన్న కులమత రీతుల
పండగ పబ్బాల పరస్పర ప్రసాదుల స్వీకర్తలు
వేకువనే పొట్టకూటికి తలొక దిక్కుకు ఎగిరిపోతారు
నిద్రించిన రోడ్లు, హోటళ్ళు, దుకాణాలు
వీరి చెమటతో ప్రాణం పోసుకుంటాయి
కర్మాగారాల సైరన్ శబ్దంలో,
వారి అంతరాంతరాల ఘోష వినిపిస్తుంది
రెక్కలు ముక్కలు చేసుకొని, ఎర్రబారిన పొద్దు తరువాత
ఇంటి గూటిలో వాలిపోతారు
నాణేనికి రెండోవైపు వలె
చిమ్మచీకటిలో మరో లోకంలో మునిగిపోతారు
తాగుడు, కొట్లాటలుగా తీవ్రతరమైన అమాయకత్వం
ఇంటిమీద కాకిని కూడా వాలనివ్వని పచ్చగడ్డి మంట

అయినా
సాటి మనిషి ఆపదలో మాత్రం
అన్నీ మరచి, బంధుజనంగా సంఘటితాప్తులు అవుతారు
అప్పుడప్పుడే చదువుకొస్తున్న బాలకిరణాల వెలుగులో
ప్రపంచాన్ని దర్శిస్తున్న నిరుపేదలు
పూరిపాకల నిరుపేదలే
కానీ
నిరుపమాన ఆత్మీయతల ఆస్తిపరులు
రక్తబంధం కాకపోయినా
వాడ వాడంతా
ఒక మానవత్వపు ఉమ్మడి కుటుంబం

❋

# Rainmaker

**1997లో విడుదలైన రెయిన్ మేకర్ సినిమా పరిచయం**

**దర్శకుడు: Francis Ford Capola**

- కాళిదాసు పురుషోత్తం
9247564044




కపోలా దర్శకత్వం వహించిన రెయిన్‌మేకర్ సినిమా జాన్ గ్రాసిమ్ నవలకు చలనచిత్రానుసరణ. కోర్టులు, న్యాయవాదుల్లో చిన్నచేపలు, పెద్దచేపలు, తిమింగలాలు, జీవన పోరాటంలో అణగారే అతి సామాన్యులు - ఎన్నో వైవిధ్యం ఉన్న పాత్రల్ని మన ముందుంచుతాడు దర్శకుడు. ఈ సినిమాలో కథ ఇన్సూరెన్స్ కంపెని 'లుకేమియా' రోగికి వైద్యం ఖర్చు తిరస్కరించడం అనే అంశం చుట్టూ తిరుగుతుంది.

అరుదుగా అయినా, సామాజిక సమస్యలను చిత్రించే సినిమాలు కూడా అమెరికాలో తయారవుతూ ఉంటాయి. 'న్యూవేవ్' ఉద్యమస్ఫూర్తితో కపోలా మంచి సినిమాలు తీశాడు. స్క్రీన్‌ప్లే రచయితగా, దర్శకుడుగా కపోలా ప్రసిద్ధుడు. డ్రాకులా, గాడ్‌ఫాదర్ సినిమాలతో కొత్తరకం సినిమాలకు ఆద్యుడు కావడమే కాదు, కపోలా దర్శకత్వం వహించిన '**Conversation**' సినిమాకి కాన్స్ (కేన్సు కాదు చిత్రోత్సవంలో ఉత్తమ దర్శకుడుగా పురస్కారాన్ని అందుకున్నాడు.

కపోలా దర్శకత్వం వహించిన రెయిన్‌మేకర్ సినిమా జాన్ గ్రాసిమ్ నవలకు చలనచిత్రానుసరణ. కోర్టులు, న్యాయవాదుల్లో చిన్నచేపలు, పెద్దచేపలు, తిమింగలాలు, జీవన పోరాటంలో అణగారే అతి సామాన్యులు - ఎన్నో వైవిధ్యం ఉన్న పాత్రల్ని మన ముందుంచుతాడు దర్శకుడు. ఈ సినిమాలో కథ ఇన్సూరెన్స్ కంపెని 'లుకేమియా' రోగికి వైద్యం ఖర్చు తిరస్కరించడం అనే అంశం చుట్టూ తిరుగుతుంది.

రూడీ పేద కార్మిక కుటుంబంలో పుట్టాడు. అతని తాగుబోతు తండ్రి ఫ్యాక్టరీలో జరిగిన ప్రమాదంలో గాయపడి కొంతకాలం తర్వాత చనిపోతాడు. అనేక అననుకూల పరిస్థితుల్లో కష్టపడి లా పట్టా సాధించినా, రూడీ జీవితం వడ్డించిన విస్తరి కాదు. సహ విద్యార్థులకు లభించినట్లు తనకు పెద్ద లాయర్ల ప్రాపకం లభించే అవకాశం లేదు కనుక, రూడీ మెడికల్ ఇన్సూరెన్స్ కేసుల్లో తలపండిన బ్రూయిస్ అనే సీనియర్ వద్ద సహాయకుడుగా చేరాడు. స్థానిక ఆస్పత్రిలో క్షతగాత్రులను వెదికి పట్టుకొని (**ambulance chaser**) కేసులు తెమ్మని పురమాయిస్తాడు సీనియర్ బ్రూయిస్. అప్పటికే రూడీ చేతిలో రెండు కేసులుంటాయి. ఒకటి లుకేమియా రోగికి సంబంధించినది, రెండోది ఒక వృద్ధురాలికి వీలునామా రాసిపెట్టడం.

రూడీకి సహాయకుడుగా ఉండి, కోర్టు కేసుల్లో తోడ్పడడానికి డెక్ అంగీకరిస్తాడు. చాలాసార్లు లా పరీక్షలు రాసినా, కృతార్థుడు కాలేదు కాని, ఇన్సూరెన్సు చట్టాలకు సంబంధించిన పరిజ్ఞానం, అనుభవం అతనికి పుష్కలంగా వుంది. సాక్ష్యాలు సమకూర్చడం, ఆఫీసుల్లో రికార్డులు వెదికి సంపాదించడం వంటి విషయాల్లో మాత్రం అతను అఖండుడు. సమయానికి సీనియర్ లేకపోతే, జడ్జి ముందు కేసు వాదించి గండం గట్టెక్కించగలడు.

శాడిస్ట్ మొగుడి చేతుల్లో దెబ్బలు తిని ఆస్పత్రి పాలయిన కెల్లి అనే యువతి రూడీకి పరిచయం అవుతుంది. తన్నులు

తింటూ సంసారం చెయ్యకపోతే విడిపోవడం మేలని రూడి సూచిస్తాడు. రిపోర్టు చేసినా, భర్త తనను బతకనివ్వడని ఆమె సమాధానం చెప్తుంది.

గ్రేట్ బెనిఫిట్ ఇన్సూరెన్సు కంపెని మీద లుకేమియా రోగి వేసిన సూటు విచారణకు (**pretrial**) వస్తుంది. తన సీనియర్ అందుబాటులో లేక, కేసు రూడీయే వాదించవలసి వస్తుంది. కంపెని తరఫున వాదించడానికి డ్రమర్డ్ అనే పెద్ద లాయరు నాయకత్వంలో ఒక న్యాయవాదుల బృందమే సిద్ధంగా ఉంటుంది. ఇటువంటి సూట్ల పట్ల జడ్జికి సానుభూతి ఉండదు. ఇవి కోర్టు సమయాన్ని వృథా చేసే 'లాటరి' కేసులని ఆయన నిశ్చితాభిప్రాయం. తొలిసారి కోర్టులో వాదించడానికి వచ్చిన రూడీని చూసి జడ్జి మండిపడతాడు. రూడీని రిజిస్ట్రేషన్ పత్రాలు చూపమంటాడు. రూడి లా పాసైనా, అప్పటికి ఈ తతంగం ఇంకా పూర్తి కాలేదు. "రిజిస్ట్రేషన్ దేముంది, నాకభ్యంతరం లేదు, వాదించమనండి"' కంపెనీ పక్షం న్యాయవాది డ్రమర్డ్ రూడి పట్ల సానుభూతి నటిస్తూ అంటాడు. అనుభవం లేని కొత్తవాడైతే, తన వాదనాపటిమతో బురిడీ కొట్టించవచ్చని అతని అభిప్రాయం.

జడ్జిగారి గదిలో అందరూ సమావేశ మవుతారు. డెబ్బైవేల డాలర్లు, కోర్టు ఖర్చు ఇస్తామని డ్రమర్డ్ ప్రతిపాదిస్తాడు. డ్రమర్డ్ రూడీని 'మై డియర్ సన్, మై ఛైల్డ్' అని చాలా దయగా సంబోధిస్తూ, "నీకేమీ తెలీదు. నువ్వు ఒట్టి అమాయకుడివి" అనే అర్థం వచ్చేట్లు తక్కువచేసి మాట్లాడుతూ ఉంటాడు. కంపెని ప్రతిపాదనను తన కక్షిదారుకు తెలియజేస్తానని రూడీ జడ్జికి విన్నవిస్తాడు. సమావేశం జరిగినంత సేపూ జడ్జి విధివిరామం లేకుండా దగ్గుతూనే ఉంటాడు. "ఈ జడ్జి పొగాకు లాబీకి అనుకూలుడు" డెక్ రహస్యంగా రూడీ చెవిలో అంటాడు.

తన సీనియర్ లాయర్ ఏవో అక్రమ ఆర్థిక లావాదేవీల్లో చిక్కుకొన్నాడని గ్రహించి, రూడీ తన సహాయకుడు డెక్‌తో కలిసి ఒక పాడుబడిన ఇంట్లో గది అద్దెకు తీసుకొని ఆఫీసు తెరుస్తాడు. తన క్లయింట్ అయిన ముసలావిడను ఒప్పించి ఆమె ఇంట్లో ఖాళీగా ఉన్న పోర్షన్‌లోకి మారతాడు. ప్రత్యుపకారంగా ఆమె లాన్, ఇంటి పరిసరాలు శుభ్రం చేసే బాధ్యత స్వీకరిస్తాడు.

లుకేమియా రోగి తల్లి మిసెస్ బ్లాంక్ ఇన్సూరెన్సు కంపెనీ ప్రతిపాదనను తిరస్కరిస్తూ, తనవంటి పేదవాళ్ళతో కంపెని ఆడుతున్న నాటకాన్ని లోకానికి తెలిసేటట్లు చెయ్యమని రూడీని అర్థిస్తుంది. 'జడ్జిగారు గుండెపోటుతో పోయారు, ఆయన స్థానంలో పౌరహక్కుల న్యాయవాదిని, ఆఫ్రో అమెరికన్‌ను నియమించారు' – డెక్ రూడీకి 'శుభవార్త' ఫోన్‌చేసి చెప్తాడు. కొత్తజడ్జి ప్రిట్రయల్ దశలోనే కేసు డిస్మిస్ చేయడానికి ఒప్పుకోడు, పైగా కేసు విచారణ త్వరగా ముగించాలని తీర్మానించి, ఇరుపక్షాల న్యాయవాదుల సమక్షంలో రోగిని అతని ఇంటివద్దే విచారిస్తాడు. ఆ ఇల్లు, పేదరికం, విచారణ జరుగుతున్న సమయంలోనే రోగి తండ్రి ఆ సమీపంలోనే కూర్చొని మద్యం తాగుతూ కన్పించడం, ఆ దృశ్యం మనసును కలచివేస్తుంది.

*ఆ ఇల్లు, పేదరికం, విచారణ జరుగుతున్న సమయంలోనే రోగి తండ్రి ఆ సమీపంలోనే కూర్చొని మద్యం తాగుతూ కన్పించడం, ఆ దృశ్యం మనసును కలచివేస్తుంది.*

కెల్లి కోరిక ప్రకారం రూడీ ఆమెను రహస్యంగా ఒక సినిమా హాల్లో కలుస్తాడు. తన భర్త పిల్లల్ని కనమని ఒత్తిడి చేస్తున్నాడని, పిల్లలు పుడితే తాను అతని దగ్గరే పడిఉంటానని నమ్మకమని ఆమె అంటుంది. రూడీ 'నీ ఇష్టం' అంటాడు. క్రమంగా ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరుగుతుంది.

కోర్టు ఆదేశం ప్రకారం ఇన్సూరెన్సు కంపెని ఆఫీసులో కంపెని యాజమాన్యం, న్యాయవాదుల బృందంతో సమావేశమైన రూడీ కంపెని ఉద్యోగి జాక్ లెవెన్స్కిని విచారణకు పిలిపించమంటాడు. 'ఆమె రాజీనామా చేసి వెళ్లిపోయింది. ఏమయిందో మాకు తెలియదు' – కంపెనీ న్యాయవాది డ్రమర్డ్ సమాధానం. మరొక ఉద్యోగి లఫ్‌కిన్‌ను పిలిపించమని రూడీ కోర్తాడు. ఉద్యోగుల సంఖ్యను క్రమబద్ధం చేసే క్రమంలో (డౌన్‌సైజ్) అతన్ని పంపించేయాల్సి వచ్చింది" – ముందులాగే డ్రమర్డ్ సమాధానం. 'సరే లెండి, కంపెనీ వైస్ ప్రెసిడెంటునైనా పిలవండి, అతన్నైనా ఉంచారా? డౌన్‌సైజ్ చేసేప్పుడు తొలగించారా?' కంఠం తగ్గించే వ్యంగ్యంగా అంటాడు రూడీ. 'డ్రమర్డ్ గారూ! మీకేమైనా గుర్తుందా? మీరెప్పుడు అమ్ముడుపోయారో?' రూడీ అన్న మాటలకు డ్రమర్డ్ నిర్ఘాంతపోతాడు. 'మాటలు తిన్నగా రానీ' డ్రమర్డ్. 'ఇంకేం చెయ్యాలి, మెంఫిస్ నుంచి ఇంత దూరం వచ్చాను. నలుగుర్ని విచారణకు పిలిపించమని కోరా. ఏవో కబుర్లు చెప్పారు.' రూడీ జంకకుండా సమాధాన మిస్తాడు.

రూడీ పసివాడు, కొత్తగా న్యాయవాద వృత్తిలో

ప్రవేశించాడు, వృత్తిలో నిర్మమకారంగా నడుచుకోడం, డిటాచ్‌మెంట్ అతనికి ఇంకా పట్టుబడ లేదు, కేన్సర్ పేషెంటు విషయంలోను, కెల్లి సంసారం గొడవల్లోను భావావేశానికి లోనౌతాడు. మెడికల్ ఇన్సూరెన్సు చేసుకొన్నా, ఆధునిక వైద్యం అందుబాటులో ఉండీ ఒక బీదవాడు, యువకుడు వైద్యం లేక కళ్ళముందే మృత్యువుతో పోరాడుతూ ఉండడాన్ని అతను జీర్ణించుకో లేదు. ఒక్కడే, ఒంటరి పోరాటం చేయాల్సి వచ్చినా ప్రత్యర్థులు బలవంతులే అయినా ప్రతీకారం తీర్చుకోడానికే అతను తీర్మానించుకొంటాడు.

**ఒక బీదవాడు, యువకుడు వైద్యం లేక కళ్ళముందే మృత్యువుతో పోరాడుతూ ఉండడాన్ని అతను జీర్ణించుకో లేదు. ఒక్కడే, ఒంటరి పోరాటం చేయాల్సి వచ్చినా ప్రత్యర్థులు బలవంతులే అయినా ప్రతీకారం తీర్చుకోడానికే అతను తీర్మానించుకొంటాడు.**

రాత్రి గాఢనిద్రలో ఉన్నపుడు రూడీకి ఫోన్‌వస్తుంది. ఉన్నపళంగా కెల్లి పనిచేసే షాపుకు చేరుకుంటాడు. నెత్తురు గాయాలతో ఉన్న కెల్లీని చూపుతారు ఆమె సహఉద్యోగులు. 'మళ్ళీ కొట్టాడు. నేను చచ్చిపోయే దాకా ఊరుకోడు.' కెల్లి అంటుంది. రూడీ ఆమెను తన ఇంటి యజమానురాలి సంరక్షణలో ఉంచుతాడు.

లుకేమియా పేషెంట్ చివరి వాంఙ్మూలాన్ని రూడి, అతని మిత్రుడు కలిసి వీడియో రికార్డు చేస్తారు. తమ ఆఫీసులో కంపెనీ న్యాయవాది తాలూకు మనుషులు రహస్యంగా మైక్రోఫోను పెట్టినట్లు రూడి గ్రహిస్తాడు. జ్యూరి సభ్యులొకరు రూడితో మాట్లాడినట్లుగా, ఒక మిత్రుడి చేత డెక్ రూడీకి ఫోన్ చేయిస్తాడు. ఈ సంభాషణ నిజమని నమ్మి, డ్రమర్డ్ కోర్టులో ఆ జ్యూరి సభ్యుణ్ణి తొలగించాలని, లేదా జ్యూరీనే మార్చాలని పట్టుబడతాడు. జడ్జి అందుకు ఒప్పుకోడు గాని, జ్యూరీ సభ్యులకు మాత్రం డ్రమర్డ్ మీద సదభిప్రాయం తొలగిపోతుంది. తాను తీసిన గోతిలో తానే పడ్డట్లు తెలుసుకొని క్రోధంతో ఉడికిపోతాడు డ్రమర్డ్.

కెల్లీ విడాకుల కోసం అర్జీ దాఖలు చేసి, రాత్రివేళ, భర్త లేని సమయం చూసుకొని, రూడీని తోడు తీసుకొని ఇంటికి పోతుంది. హడావిడిగా తన వస్తువులు తీసుకొని బయల్దేరుతున్న సమయంలో ఆమె భర్త తలుపు బద్దలు కొట్టి లోపల ప్రవేశించి దాడి చేస్తాడు. ఆ ఘర్షణ, పెనుగులాటలో ఆమె భర్త గాయపడి నేలమీద పడిపోతాడు. కెల్లి రూడీ చేతిలో బ్యాటు తను తీసుకొని రూడీని అక్కణ్ణించి వెళ్ళిపొమ్మంటుంది. రూడీ కారెక్కుతుంటే బ్యాటుతో మరొకసారి కొట్టిన శబ్దం వినిపిస్తుంది. పోలీసులు కెల్లిని అరెస్టు చేస్తారు.

ఇన్సూరెన్సు కంపెనీపై కేసు విచారణకు వస్తుంది. 'ఇంతకుముందు ఏడు పర్యాయాలు తెలియజేశాము, సరైన క్లెయిమ్ కాదని, **.You must be stupid, stupid, stupid.**' గ్రేట్ బెనిఫిట్ ఇన్సూరెన్స్ కంపెని తన కుమారుడి ఇన్సూరెన్సు విషయంగా పంపిన సమాధానాన్ని మిసెస్ బ్లాక్ నిండుకోర్టులో చదివి వినిపిస్తుంది. "పది మిలియన్ డాలర్లు పరిహారం కోరుతూ కేసు వేశావు. అంత డబ్బేం చేస్తావు?" డిఫెన్స్ న్యాయవాది డ్రమర్డ్ ప్రశ్నిస్తాడు. 'అమెరికన్ లుకేమియా సొసైటీకి ఇచ్చేస్తా. ఒక్క డైమ్ కూడా నాకక్కర లేదు.' మిసెస్ బ్లాక్ సమాధానం. రూడీ సహాయకుడు డెక్ ఇన్సూరెన్స్ కంపెనీ మాజీ ఉద్యోగిని మిసెస్ జాక్ లెవెన్స్కిని వెదికి పట్టుకొని కోర్టులో సాక్ష్యం చెప్పిస్తాడు. ఆమె సాక్ష్యం ఆమె మాటల్లోనే.

"మొదట క్లెయిమ్‌లన్ని ఒక వ్యక్తికి వెళ్తాయి. అతను కంపెని ఉద్యోగి కాదు. క్లెయిమ్‌లన్నిట్నీ తిరస్కరిస్తూ అతను సమాధానం పంపుతాడు. '**Don't Pay**' అనే రిమార్కుతో ఆ అభ్యర్థనలన్నిట్ని కంపెనీ ఆఫీసుకు పంపుతాడు. ప్రతి క్లెయిమ్‌ను తిరస్కరించాలనే ఉద్యోగులకు ఇచ్చిన మాన్యువల్‌లో ఉంది. పేద ప్రజలు కంపెనీకి ఉత్తరాలు రాసి రాసి విసిగిపోయి మానుకుంటారు. న్యాయసహాయం తీసుకొనే సౌలభ్యం వాళ్ళకు తెలీదు. నేను ఉద్యోగానికి రాజీనామా చెయ్యలేదు. ఉద్యోగంలోంచి తొలగించారు. **Fired.** రాజీనామా పత్రం రాసిచ్చి గుట్టుగా వెళ్ళిపోతే పదివేల డాలర్లు ఇస్తామని, ఈ విషయం ఎక్కడా బహిర్గతం చేయనని నాచేత ఒక జాబు గూడా రాయించుకున్నారు."

కంపెనీ న్యాయవాది డ్రమర్డ్: 'నీకు కంపెని సిఇవోతో సంబంధం ఉండేది. దాన్ని అడ్డం పెట్టుకొని బ్లాక్‌మెయిల్ చేస్తున్నావ్!"

ఆమె: 'సెక్సు సంబంధాలు పెట్టుకొన్నపుడు ప్రమోషన్లు ఇచ్చారు, మానుకొంటే హోదా, జీతం తగ్గించారు.'

జాక్ లెవెన్సి కోర్టులో ప్రదర్శించిన మాన్యువల్ దొంగిలించిన రికార్డని, దాన్ని సాక్ష్యంగా అంగీకరించ రాదని కంపెనీ న్యాయవాది చేసిన వాదనతో జడ్జి అంగీకరిస్తాడు. దొంగలించిన రికార్డయినా, కోర్టులో సాక్ష్యంగా అంగీకరించవచ్చని పై కోర్టులిచ్చిన తీర్పును రూడీ జడ్జిగారి ముందు పెట్టడంతో కంపెని మాన్యువల్‌ను **evidence**గా

# మరచిపోతే ఎలా !

నూనెల.శ్రీనివాసరావు
9492970231



ఎగసిన
నిరసన అల
విరిచేసినా...
ఎంత సేపు నిలుస్తుంది
అధికారమధం ?

లోలోపల
అశాంతి భీజం
తొలగునందాక
తొలగునా

సుడితిరిగే
సుడిగుండం ?

ఒడ్డున నిలబడి
రాళ్ళేస్తే
కప్పోడిపోవునా
కల్లోల సాగరం ?

ఎంత విరిగినా
అంతే బలంగా ఎగసే

అల
అలా....అలా....
మీసం మెలేసే
మూర్ఖత్వాన్ని
ఊడ్చుకుపోయే
సునామౌతుందని
తెలియదా ?

మరచిపోతే ఎలా
గతం గుర్తుంటేనే

వర్తమానం రాణిస్తుంది
భవిష్యత్తు నిలవనిస్తుంది !

❋

---

జడ్జి ఆమోదిస్తాడు. తమాషా ఏమంటే ఆర్థిక నేరాల ఆరోపణలు ఎదుర్కొని, ఎక్కడో దూరప్రాంతంలో విలాసజీవితం గడుపుతున్న రూడీ సీనియర్ లాయరు బ్రూయిస్‌నే పైకోర్టు తీర్పుల వివరాలు ఫోన్‌లో అందించి సమయానికి ఆదుకుంటాడు.

కంపెనీ రికార్డు ప్రకారం 1995లో పేద ప్రజలు నివసించే ప్రాంతాల్లో నగదు రూపంలో ప్రీమియం వసూలు చేసి 98 వేల పాలసీలు అమ్మినట్లు, అందులో 11 వేల క్లెయిమ్‌లు అందితే, 9,149 క్లెయమ్‌లు తిరస్కరించబడినట్లు రూడీ నిరూపిస్తాడు.

ప్రయోగదశలో ఉన్న వైద్యానికి కంపెనీ ఖర్చులు భరించదనే నిబంధనను అడ్డం పెట్టుకొని మిసెస్ బ్లాక్ కుమారుడి వైద్యం ఖర్చులు పాలసీ కవర్ చేయదని తిరస్కరించిన గ్రేట్ బెనిఫిట్ ఇన్సూరెన్సు కంపెని సి.ఇ.ఓ., లుకేమియా కేన్సరు వైద్య పద్ధతులు స్థిరీకరణ చెందాయి కనుక, ఆ వైద్యం అందించే ఆస్పత్రుల్లో కంపెనీ లాభాలను పెట్టుబడిగా పెట్టవచ్చంటూ మేనేజ్‌మెంటుకు పంపిన ఉత్తరాన్ని రూడీ కోర్టు ముందుంచుతాడు. చివరగా లుకేమియా రోగి మరణ వాంఙ్మూలాన్ని రికార్డు చేసిన వీడియోను రూడీ కోర్టులో ప్రదర్శిస్తాడు.

ఈ కేసులో నష్టపరిహారం చెల్లిస్తే, ఇన్సూరెన్సు కంపెనీలు దివాలా తీస్తాయని, వైద్యం, బీమా వ్యాపారాన్ని ప్రభుత్వం జాతీయం చేసే ప్రమాదం ఉందని డిఫెన్సు లాయర్ జూరీని భయపెడ్తాడు. జూరి ఎవరూ ఊహించనంత నష్టపరిహారం 150 మిలియన్ డాలర్లు మిసెస్ బ్లాక్‌కు చెల్లించాల్సిందిగా తీర్పు చెప్తుంది.

ఇన్సూరెన్సు కంపెనీ మీద ఎంతమంది సూట్లు వేశారోగాని ఆ కంపెనీ దివాలా తీస్తుంది, కంపెని సి.ఇ.ఓ. దేశం విడిచిపెట్టి పారిపోతూ అరెస్టవుతాడు. మిసెస్ బ్లాక్‌కు పరిహారం అందదు. రూడీ, అతని సహాయకుడికి ఫీజు కూడా రాదు. గ్రేట్ బెనిఫిట్ ఇన్సూరెన్సు కంపెనీ మరింతమందిని మోసగించకుండా ఆపగలగడం ఒక్కటే రూడీ సాధించిన విజయం.

హత్యానేరం నుంచి విముక్తి పొందిన కెల్లీతో కలిసి రూడీ ఎక్కడో సుదూరప్రాంతంలో లా కాలేజీలో అధ్యాపక వృత్తిని అంగీకరించి వెళ్ళిపోవడంతో సినిమా ముగుస్తుంది. రూడీకి న్యాయస్థానాల పద్ధతుల మీద విరక్తి కలుగుతుంది.

'రెయిన్‌మేకర్' చిత్రంలో పాత్రలన్నీ నిజజీవితంలో మనకు తారసపడేవే. రూడీ ఇంటి యజమానురాలి కథ, కెల్లి కథ ప్రధాన ఇతివృత్తంతో పెనవేసుకుపోయి కథాగమనానికి సహకరిస్తాయి. కోర్టు దృశ్యాలు సహజంగా, ఒకింత నాటకీయంగా ఉంటాయి. రూడీ పాత్ర ధరించిన కథానాయకుడు మేట్‌కు నిజజీవితంలో అప్పటికి పాతికేళ్ళకు మించి ఉండవు. అప్పుడే లా కాలేజి నుంచి బయటకొచ్చిన విద్యార్థిగా ఎంతో సహజంగా, తక్కువ హావభావాల ప్రదర్శనతో ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొంటాడు. కోర్టులు, న్యాయవాదుల భాషలో రెయిన్‌మేకర్ అంటే కక్షిదారులను ఆకర్షించి కేసులు బాగా సంపాదించుకొనే న్యాయవాదట!

❋

# జండా పై కపిరాజు



- అనిల్ డ్యాని
9703336688



సరిగ్గా రెండూర్ల పొలిమేరల్లో
దిగుతారు నాటకాల వాళ్ళు
ఎన్నో సార్లు సాధన చేసి
నాటకానికి తయారౌతారు

హార్మోణియాలు , తబలాలు
సరి చేసుకుంటుంటే గాల్లో
ఆహ్వానాలు వెళ్తాయి
రెండు పక్షాల యుద్ధం
నాటకం పరమావధి
కిరీటాలు , రంగురాళ్ళ ఉంగరాలు
అద్దాల్లా మెరిసే ముఖాలు
"శుక్లాం బరధరం విష్ణుం"
మైకులు ఘర్జిస్తాయి
ప్రేక్షకులు రెండు శిబిరాలుగా చీల్తారు
యుద్ధం జరుగుతుందో లేదని
శిబిరాల్లో ఆందోళన
జగన్నాటక సూత్రధారొకడు యుద్ధాన్ని
వాయిదా వేస్తూ పద్యం అందుకుంటాడు
యుద్ధం ఎంతకీ రాదు
శిబిరాలు రగుల్తుంటాయి
హృద్యంగా పద్యాలు
ఏరులై పారుతుంటాయి
ఈలలు , గోలలు
గడ్డి వాముల్లో సరస క్రీడలు
రసవత్తరంగా సాగుతుంటాయి

నలుగురు సూత్రధారుల్లో
యుద్ధం చేసేదెవరో
ప్రేక్షక శిబిరాల్లో అసహనం
యుద్ధం జరగదని నటులకి ముందే
తెలిసిన నిజం
జనం చప్పట్ల మధ్యలో నలిగిపోతుంది

తెరముందే వెలుతురు
వెలుతురులోనే ప్రగల్భాలు
నటులంతా మా గొప్పగా పలికిస్తారు
తెర వెనకంతా చీకటి
చెక్క కత్తులు , అట్ట ముక్కల డాళ్లు తో
యుద్ధం చేస్తే రక్తం స్రవించదు
నాటకమెప్పుడూ నిజం కాదు
ప్రగల్భాలకి పదునుండదు
యుద్ధంపై పందాలు కాసి
రెండు శిబిరాల పాత గాయల్తో
రగుల్తుంటాయి

నాయనా ! రాకుమార
ఇది యుద్ధ వాతవారణమే
కాని రణం జరగని వాతావరణం
నిజం తెలిసిన నటులు
రాగాలు తీస్తూనే ఉంటారు
ప్రశ్నించడం చేతగాని
శిబిరాలు మెల్లిగా శూన్యమౌతాయి
నాటకం మెల్లిగా యుద్ధం లేకుండానే
ముగుస్తుంది
తెల్లారి పత్రికలన్నీ
సరిహద్దుల్లో "శాంతి కపోతం "
అని బేనర్లు వేస్తాయి

పళ్ళూడిన ముదసలొకడు
పగిలిన కళ్ళజోడులోంచి
సూర్యుణ్ణి చూస్తుంటాడు
అతనికి తెలుసు
యుద్ధమొక నాటకమని
రెండు సరిహద్దుల
మధ్యన యుద్ధమంటే
నాలుగు చితుకుల్ని పోగేసి
చలి కాచుకోవడమని
రాలిపోతున్న రోజులకి
కసి మాటలని పూస్తూ
ఉసికొల్పడమని
రెండు శిబిరాల ఆరని శ్వాసలు
రగుల్తూనే రంకెలేస్తుంటాయి

ఆకాశం ప్రశాంతంగానే ఉండి
ఒక నగరం ధ్వంసం అవుతుంది
రాలిన శవాల మధ్యన
గెలుపు జండా ఎగుర్తుంది
ముగిసిన నాటకం
గెలుపెవరిదని ఎప్పటికీ చెప్పదు
ఎక్కడ దిగాలో తెలీని ఓ పావురం
మనిషి కోసం వెతుకుతుంది

# చలం కలంలో కమ్యూనిజం

- తెలకపల్లి రవి




ఒక దశలో ఆయన ఆశలన్నీ కమ్యూనిస్టులపైన కమ్యూనిజంపై వుంచినట్టు కనిపిస్తుంది. 'ఎట్లా లోక కళ్యాణం చెయ్యాలని ఆలోచిస్తే ఒక్క కమ్యూనిజమే మిగిలివుంది ఆధారంగా' అంటాడు. 'చేస్తే కమ్యూనిస్టులే చేయాలి. కమ్యూనిజం తప్పదు' అని ఖచ్చితంగా చెప్పేస్తాడు. 'ఆధ్మాత్మిక వాదులు మనసుకు ఎలాటి దిగుళ్లు లేకుండా పోవాలంటే ఏదీ పట్టించుకోకుండా వుండే తత్వం దానికి అలవర్చాలంటారు. అంటే మనసును మార్చాలంటారు. అదే కమ్యూనిస్టులు ఆ బాధలకు మూలమైన పరిస్థితులను మారిస్తే మనసుకు వాటిని పట్టించుకునే పనే వుండదని చెబుతారు' ఇది చలంకు వున్న స్పష్టత. 'యీనాటి పాత బూజుదులిపి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలిగిన వారు కమ్యూనిస్టులే'నని బల్లగుద్దిచెబుతాడు.

సోషలిజం గురించిన చలం ఆలోచలను ఒక చోట చూడటం ఎంతో సంతోషకరమైన అనుభవం. స్వేచ్ఛా భావుకుడైన చలం సమతా ధర్మమైన కమ్యూనిజాన్ని అభిమానించడం, దాని నుంచి చాలా ఆశించడం సహజమే. చలం చిత్తశుద్ధిని ప్రజా పక్షపాతాన్ని తెలియజేసే గొప్ప ఉదాహరణ ఇది. 'కమ్యూనిజం సర్వశక్తివంతమైంది: ఎందుకంటే అది సత్యం గనక' అంటాడు లెనిన్. చలం రచనలు చాలా వాటిలో మనకు కనిపించే పదం 'సూనృత శక్తి'. అంటే సత్యానికి వున్న శక్తి. సత్యమేవజయతే అని నినాదం లిఖించుకున్న ఈ దేశంలో నిజానికి అసత్య ప్రవచనాలే అధికంగా చలామణి అవుతుంటాయి. కాని సామాజిక బంధనాలను తెంచిపారేసేందుకు సిద్ధమైన ఒక సాహితీ తిరుగుబాటుదారుగా చలం ఆర్థిక రాజకీయ తిరుగుబాటు పతాకగా నిలిచిన సోషలిజం సిద్ధాంతాలను మనసారా ఆహ్వానించాడని చెప్పేందుకు ఈ పుస్తకంలోని చాలా ఎంట్రీలే తిరుగులేని దాఖలా.

సోషలిజంపై చలం తరహా ఆసక్తికరమైన ఆలోచనాత్మకమైన ఆకర్షణీయమైన వాక్యాలు ఈ సంపుటిలో వున్నాయి. వివేచనాత్మకమైన సందిగ్ధాలు సందేహాలు కూడా వున్నాయి. సోషలిజాన్ని ఆహ్వానించడంతోపాటు ఆక్షేపించే భాగాలూ వున్నాయి. అయినా సరే - మొత్తంపై చలం ఎటు వున్నాడంటే సామ్యవాద భావాలలో గొప్ప విముక్తి తత్వం చూస్తున్నాడు. 'ప్రజలందరూ సమానులే... అన్న భావం చాలా మనుష్యం' ఈ పదం చూడండి. మనష్యం అట. మానవత్వం అంటే అందులో కొంత విశేషణం వున్నట్టు. కాని మనుష్యం అనడంలో మనుషులకు వుండాల్సిన స్వాభావిక లక్షణం అని స్పష్టం చేస్తున్నాడు.

ఒక దశలో ఆయన ఆశలన్నీ కమ్యూనిస్టులపైన కమ్యూనిజంపై వుంచినట్టు కనిపిస్తుంది. 'ఎట్లా లోక కళ్యాణం చెయ్యాలని ఆలోచిస్తే ఒక్క కమ్యూనిజమే మిగిలివుంది ఆధారంగా' అంటాడు. 'చేస్తే కమ్యూనిస్టులే చేయాలి. కమ్యూనిజం తప్పదు' అని ఖచ్చితంగా చెప్పేస్తాడు. 'ఆధ్మాత్మిక వాదులు మనసుకు ఎలాటి దిగుళ్లు లేకుండా పోవాలంటే ఏదీ పట్టించుకోకుండా వుండే తత్వం దానికి అలవర్చాలంటారు. అంటే మనసును మార్చాలంటారు. అదే కమ్యూనిస్టులు ఆ బాధలకు మూలమైన పరిస్థితులను మారిస్తే మనసుకు వాటిని పట్టించుకునే పనే వుండదని చెబుతారు' ఇది చలంకు వున్న స్పష్టత. 'యీనాటి పాత బూజుదులిపి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలిగిన వారు కమ్యూనిస్టులే'నని బల్లగుద్దిచెబుతాడు. అలా 'ప్రజల కోసం పోరాడే ప్రతి చిన్న యోధుడు వాస్తవమైన

కామ్రేడే'నంటాడు. దేశభక్తి సంఘసంస్కరణ అన్నిటిపైనా అవిశ్వాసం ప్రకటించిన చలం కమ్యూనిజంపైన కమ్యూనిస్టులపైన అపారమైన ఆశావిశ్వాసాలు చాటిచెప్పడంలో నాటి చాలా మంది విశ్వవిఖ్యాత మేధావులు రచయితల సరసన వున్నాడనేది గమనించాల్సిన విషయం. (పుస్తక సంకలన కర్త ఆళ్ల గురుప్రసాదరావు ఉపోద్ఘాతంలో ఆ జాబితా వుంది) నిస్సందేహంగా చలం ఆ కోవకు స్థాయికి చెందిన మహా ప్రజ్ఞావంతుడు. కనుకనే కమ్యూనిస్టు దేశాలు ఇంకా మహత్తర విజయాలు సాధించక ముందే దాని సమర్థతను, సామాజిక విమోచన స్వభావాన్ని పట్టుకోగలిగాడు. తనకూ కమ్యూనిస్టులకు వున్న పోలిక ఏమిటో కూడా తనే వెల్లడించాడు:

'చలం కథల్లో విలన్ సంఘం. కమ్యూనిస్టుల కథల్లో క్యాపిటలిజం. క్యాపిటలిజాన్ని చలం ద్వేషించనంత తీవ్రంగానూ కమ్యూనిస్టులు అసహ్యించుకుంటారు. 'వారిలా తను అనిగాక తనలా వారు అనడంలో స్వతహాగా తాను పెట్టుబడిదారీ విధాన వ్యతిరేకినని ప్రకటించుకుంటున్నాడన్నమాట.

మరో విశేషం చలం చింతాదీక్షితులు పేర వెలువడిన గీతాల్లో ఒక చోట వున్న చరణాలు

*చందమామ రావే జాబిల్లిరావే*
*రైలెక్కి రావే రష్యా కథలు తేవే*
*బస్సెక్కి రావే బంగ్లా కథలు తేవే*
*కారెక్కిరావే కామ్రేడ్ కథలు తేవే*

అనాడు తెలుగు నేలను వూపేసిన సామ్యవాద ఉద్యమాల వెల్లువ సాహిత్య ప్రభంజనం ఈ చరణాల్లో తొంగి చూస్తుంది. సోషలిజం వచ్చిన తర్వాత అనేక హక్కులూ సదుపాయాలు వచ్చినట్టు తనతో చెప్పిన వారిని ఉటంకిస్తూ పేర్కొన్నాడు.

అయితే చలం రచయితగా వెలిగిపోతున్నా రగిలిపోతున్నా మౌలికంగా దేన్నీ తేలిగ్గా నమ్మే వ్యక్తి కాదు. ప్రతిదీ ఆచరణలో నిగ్గు తేలాలంటాడు. తర్కబద్ధంగా వుండాలనుకుంటాడు. ఇదే అంతిమం అని చెబితే ఒప్పుకోవడం ఆయనకు తెలియని విద్య. అందుకే కమ్యూనిజం పైనా మొదటి నుంచి సందేహాత్మకమైన వ్యాఖ్యలు కూడా చేస్తూ వచ్చాడు. దీనికి ఆయన జీవితానుభవమూ, మానవ స్వభావంలో సంక్లిష్టత గురించిన అవగాహన ముఖ్య కారణాలు. సోషలిజంలో వ్యక్తులకూ స్వేచ్ఛవుండదనీ, ఇష్టానుసారం వ్యవహరించడానికి అవకాశమివ్వరని తరచూవినిపించే విమర్శలపై స్పందిస్తూ – ' ఈ సమాజంలోనూ చాలా మందికి తిండి కూడా లేదు. స్వేచ్ఛ ఎలాగూ లేదు. ఈ విధంగా తిండి స్వేచ్ఛ రెండూ లేకుండా చేసే ఈ సమాజం కంటే తిండి, ఇతర దైనందిన అవసరాలు తీర్చడానికి పూర్తి బాధ్యత వహించే ప్రభుత్వం గల సోషలిజమే మెరుగని' స్పష్టం చేశాడు. అయితే అంతమాత్రాన అంతిమ విజయం సాధించినట్టు భావించడానికి లేదన్నాడు. దీనికి ఆయన చెప్పిన కారణం చాలా విలువైందని ఇప్పుడు వెనక్కు తిరిగి చూస్తే ఎవరికైనా అర్థమవుతుంది.

మానవ సమాజంలో అంటే మనుషుల ఆలోచనా ధోరణిలో దీర్ఘకాలంగా పేరుకుపోయిన పాత ఆలోచనలు అలవాట్లు అంత తేలికగా వదిలేవేవి కావని ఆనాడే వూహించాడు. 'కొన్ని ఏళ్లు పోతే గాని నిజమైన ఫలితాలు తేల్తాయి. ఓ పరిస్థితిలో మనుష్య స్వభావం ఎలా రియాక్టు చేస్తుందో నిలకడమీద గాని మనకు తెలియదు' అంటూ సోషలిజం ముఖ్యంగా సోవియట్ సోషలిజం ఎంత కాలం మనగలుగుతుందో చూడాలన్నాడు.

కమ్యూనిజం వచ్చి ఏదో గొప్ప మార్పు తెస్తుందని అందరూ ఆశిస్తున్నారనీ, ఆయన చాలా చోట్ల రాశాడు. ఈ క్రమంలోనే కమ్యూనిజమూ ఆస్తికత్వమూ ఒకటే అయినట్టు వారికి సంబంధించిన విషయాలు చెప్పాడు. సంకలన కర్త గురుప్రసాదరావు కూడా చలం ఆధ్యాత్మిక మతైక సంబోధనలకు ఇందులో చోటు కల్పించారు. సరే అదెలా వున్నా చలం ఒక దశవరకూ చాలా వాస్తవిక దృష్టితో ప్రజల కోణంలో సోషలిజాన్ని కొనియాడారు. అయితే ఆయన స్వీయ భావనలలో వచ్చిన మార్పు కూడా సోషలిజంపై స్పందనను ప్రభావితం చేసిన తీరు చూస్తాం. క్రమంగా 'కమ్యూనిజం అందరినీ వూరిస్తున్న ఒక కల' అంటూ కాస్త విడగొట్టుకునే రీతిలో వ్యాఖ్యానించడం మొదలు పెట్టాడు. ప్రజల అవసరాలు ముఖ్యమన్న వ్యక్తి ' మనిషి కేవలం వాటితోనే సంతృప్తి చెందడనేది' ప్రధానంగా ముందుకు తీసుకు వచ్చారు.తనకు అపారమైన విశ్వాసం

*'చలం కథల్లో విలన్ సంఘం. కమ్యూనిస్టుల కథల్లో క్యాపిటలిజం. క్యాపిటలిజాన్ని చలం ద్వేషించనంత తీవ్రంగానూ కమ్యూనిస్టులు అసహ్యించుకుంటారు. 'వారిలా తను అనిగాక తనలా వారు అనడంలో స్వతహాగా తాను పెట్టుబడిదారీ విధాన వ్యతిరేకినని ప్రకటించుకుంటున్నాడన్నమాట.*

కలిగించినట్టు చెప్పిన వాడు తర్వాత కాలంలో మరో విధంగా అన్నాడు. 'నా హృదయంలో దేశభక్తి పలకదు. అట్లానే కమ్యూనిస్టులు పలికే చిలకపలుకులు విని ఎప్పుడూ ఏవగింపు కలుగుతుంది. ' అన్నాడు. కమ్యూనిస్టులను మించి తనే క్యాపిటలిజాన్ని ద్వేషిస్తున్నట్టు చెప్పిన చలం ఇప్పుడు వారిపైనే ఏవగింపు కలుగుతుందని చెప్పడం విచిత్రమే. కాని జీవితపు మలిదశలో తన రచనలగురించి తనే విడగొట్టుకున్నట్టు ప్రకటించిన వ్యక్తి గనక తొలినాటి భావాలను కూడా మార్చుకోవడం పెద్ద ఆశ్చర్యమనిపించదు. మనం చెప్పుకునేది అభిమానించేది వూగిపోయేది తొలినాటి చలం గురించి తప్ప అరుణాచలం గురించి కాదు కదా! అయితే ఏ దశలోనూ ఆయన తన వ్యాఖ్యల పరిమితులు మర్చిపోలేదు. తెలిసింది తక్కువేనని, ఇంకా కొంతకాలం ఆగిచూడాలనీ, నిలబడటం కష్టమనీ పలు విధాలైన వివరణలు జోడించడంలో వినమ్రత తొంగి చూస్తుంది.

*ఇప్పుడు సంపన్న దేశాలలోను సంక్షోభాలు వస్తున్నాయన్నా, కారల్‌మార్క్స్ రచనలకు గిరాకి పెరిగిందన్నా అనేక యూరప్ దేశాలలో వామపక్ష ప్రగతిశీల ప్రభుత్వాలు వస్తున్నాయన్నా కమ్యూనిస్టు సిద్ధాంతాల మౌలిక సత్తా తెలుస్తుంది.*

1990 సోవియట్ విచ్ఛిన్నం తర్వాత చలం మాటలు నిజమైనట్టు భావించే అవకాశం వుంది. సంకలనకర్త ఆ మేరకు నోట్ రాశారు కూడా. సోషలిజం మానవ చైతన్యంలో మౌలిక దీర్ఘకాలిక మార్పు తీసుకురాలేకపోవడం దానికి ఒక కారణం కూడా. అయితే సైద్ధాంతిక విషయాలలో ఆచరణలో అంతర్జాతీయ నీతిలో నాటి (గోర్బచెవ్) నాయకత్వం అనుసరించిన ఆత్మవినాశక ధోరణులు చేసిన దోహదం కూడా చాలా వుంది. ఈ రెంటిలో దేన్ని విస్మరించినా సరైన నిర్ధారణలకు రాలేము. దానివల్ల సోవియట్ తూర్పు యూరప్‌లలో సోషలిజం కూలిపోయిన మాట నిజమే గాని అంతటితో కమ్యూనిజం కన్నా క్యాపిటలిజం గొప్పదని రుజువైపోయిందా? చలం మరణించి పుష్కర కాలం గడిచాక, సోవియట్ విచ్ఛిన్నమైనాక 1992లోనూ సౌరిస్ 'ఆయనకు కమ్యూనిజంపై అమోఘమైన విశ్వాసం వుండేదని' చెప్పడం ఆసక్తికరం. 'ఏదైనా చేస్తే కమ్యూనిస్టులే చేయాలని' చలం అనేవారని ఆమె చెప్పారు. జరిగిన తప్పిదాలను దిద్దుకుని సరైన దిశా నిర్దేశం చేసుకోవలసింది కమ్యూనిస్టులే అన్న చలం భావం ఇక్కడ సుస్పష్టం. ఇప్పుడు సంపన్న దేశాలలోను సంక్షోభాలు వస్తున్నాయన్నా, కారల్‌మార్క్స్ రచనలకు గిరాకి పెరిగిందన్నా అనేక యూరప్ దేశాలలో వామపక్ష ప్రగతిశీల ప్రభుత్వాలు వస్తున్నాయన్నా కమ్యూనిస్టు సిద్ధాంతాల మౌలిక సత్తా తెలుస్తుంది.

అసలు గురుం ప్రసాదరావుగారు తన ముందుమాటలో చెప్పినట్టు సోషలిజం విఫలమైందన్న వాదనే నిలిచేది కాదు. వేల ఏళ్ల దోపిడీ సమాజం సాధించిన దానితో పోలిస్తే 70 ఏళ్లు మాత్రమే మనుగడ సాగించిన సోషలిస్టు సోవియట్ సాధించింది చాలా ఎక్కువ. ఇప్పుడు చైనా అనుసరిస్తున్న విధానాలతో తేడా వున్నా అంతర్జాతీయ ఆర్థిక రంగంలో దాని అగ్రస్థానాన్ని ఎవరూ నిరాకరించలేరు. చైనా ఆర్థిక వొడుదుడుకులకు గురైతే (అది కూడా వ్యూహాత్మకంగానే) ఆ ప్రభావం భారత్‌తో సహా ప్రపంచంపై పడుతుంది. అమెరికాకూ సబ్‌ప్రైమ్ సంక్షోభం ముంచెత్తింది. ఇండియా పెద్ద ఆర్థిక వ్యవస్థ అని చెప్పుకుంటున్నా కార్పొరేట్ వర్గాల శాసనమే నడుస్తున్నది తప్ప ప్రజలకు మేలు జరగడం లేదు. అంతర్జాతీయ రంగంలో రెండవ ధృవంగా సోవియట్ లేకపోవడంతో దేశాలు అమెరికా కూటమి దయా దాక్షిణ్యాలపై ఆధారపడే స్థితి వచ్చింది. చలం భావాన్ని సౌరిస్ చెప్పినట్టు ఏదైనా చేయగలిగితే కమ్యూనిస్టులు చేయాలి గాని పెట్టుబడిదారీ విధానమే చివరి వాక్యం కాదు. అయితే ఈ ఎదురుదెబ్బల తర్వాత 21వ శతాబ్ది సోషలిజం ఏ రూపం తీసుకుంటుంది. వివిధ దేశాల్లో వామపక్ష కమ్యూనిస్టు శక్తులు ఏ విధంగా పునస్సంఘటితమవుతాయి అన్నది చరిత్ర చెప్పాల్సిందే. సామ్రాజ్యవాద కుట్రలను ఎంతైనా విమర్శించవచ్చు గాని కమ్యూనిస్టు శిబిరం ఆత్మ విమర్శ చేసుకోవలసింది కూడా చాలా వుందనేది నిర్వివాదాంశం.

ఈ పుస్తకంలో వ్యక్తిగతంగా నన్ను అమితంగా ఆకర్షించింది తొలిరోజుల్లో కాకినాడలో మాకినేని బసవపున్నయ్యతో మాట్లాడిన డాక్టర్ జి.వీరభద్రరావు చలంపై ఆయన భావాలను పొందుపర్చడం. చలం రచనలు చదవడం వల్ల గతతార్కిక అవగాహన, తర్కం బాగా పట్టుపడతాయని మాకినేని తనతో అన్నట్టు ఆయన రాశాడు. స్త్రీ విముక్తి కోసం చలం చేసిన పోరాటం గొప్పదైనా సామాజిక సమగ్రత లేని అరాచకత్వం ఆయనలో వుందని అభ్యుదయ వాదులు

భావిస్తుండేవారు. ఇదే విషయం మాకినేనిని అడిగినప్పుడు ఆయన ఈ మాటలు చెప్పారట. నిజానికి చలంపై కమ్యూనిస్టుల అంచనా ఎలా వున్నా ఆయన రచనలు స్వీకరించడానికి అవసరమైన భూమిక సిద్ధం చేసింది మాత్రం కమ్యూనిస్టు భావజాలమే. లేకపోతే ఈ సనాతన సమాజం వాటిని బతకనిచ్చేది కాదు.

> *చివరి రోజుల్లో చలం కాస్త భిన్నంగా మాట్లాడినా కమ్యూనిజం ఔన్నత్యానికి నీరాజనాలర్పించాడనేది ఈ పుస్తకం చెప్పే సత్యం. ఇందుకు సంబంధించిన విషయాలన్నీ ఒకే చోట గుదిగుచ్చి ఇవ్వడం పాఠకులకు ముఖ్యంగా అభిమానులకు శ్రమ తగ్గిస్తుంది.*

కనుక చివరి రోజుల్లో చలం కాస్త భిన్నంగా మాట్లాడినా కమ్యూనిజం ఔన్నత్యానికి నీరాజనాలర్పించాడనేది ఈ పుస్తకం చెప్పే సత్యం. ఇందుకు సంబంధించిన విషయాలన్నీ ఒకే చోట గుదిగుచ్చి ఇవ్వడం పాఠకులకు ముఖ్యంగా అభిమానులకు శ్రమ తగ్గిస్తుంది. సమాచారం పెంచుతుంది. ఈ రీత్యా గురుప్రసాదరావు అభినందనీయులు. కమ్యూనిజం విఫలమైందనే వాదనను తోసిపుచ్చుతూ అది లేవనెత్తిన అనేక అంశాలను పాలక వర్గాలు ఒప్పుకోకతప్పడం లేదని సోదాహరణంగా చెప్పారు. ఇదంతా దాని సైద్ధాంతిక విజయమని ఆయన చెప్పిన మాట యథార్థమే. ఇప్పుడు పేదలకు కొన్ని హక్కులు సంక్రమించడమూ ఉద్యోగ కార్మిక వర్గాల జీత భత్యాలూ పనిగంటలూ, ప్రభుత్వంపైనా యాజమాన్యాలపైనా ఒకింత అదుపూ ఇవన్నీ కమ్యూనిస్టులు నడిపించిన శ్రామిక ప్రజా ఉద్యమాల ఫలితాలే. ఇప్పుడు ప్రపంచీకరణ యుగంలో పనిగంటలు పెంచి రకరకాల షరతులతో పనిచేయించేందుకు అసంఘటిత రంగాన్ని పెంచుతున్నా దానిపై పోరాడుతున్నది ఆ ఉద్యమాలే. అదే సమయంలో కమ్యూనిజాన్ని సమర్థిస్తూనే చైనా వల్ల సోషలిజం దెబ్బతినిపోయిందనే ఆరోపణతో గురుప్రసాదరావు కొంత విమర్శ రాశారు. దాని నిజానిజాలు ఎలా వున్నా ఈ సంపుటితో పొసిగేది కాదనిపిస్తుంది. దాన్ని ఆయన విడిగా రాయడం మంచిది. ఎందుకంటే వాటితో సోషలిస్టు మూల సిద్ధాంతానికి గాని చలానికి గాని సంబంధం లేదు. అవన్నీ చరిత్ర క్రమంలో వచ్చిన వాద వివాదాలు.

నాస్తికత్వంపై చలాన్ని అదేపనిగా అడిగిన వారి ఇంటర్వ్యూలు ఆయన సమాధానాలు ఇందులో చాలా వున్నాయి. కమ్యూనిస్టులకు ఆసక్తి వుంటుందనే భావంతో వాటిని ఇస్తున్నట్టు సంకలనకర్త వివరణ ఇచ్చారు కూడా. కమ్యూనిస్టులు ప్రపంచాన్ని గతితార్కిక భౌతికవాద దృష్టితో చూస్తారనేది నిజమే. ఆ రీత్యా వారు హేతువాదాన్ని బలపర్చే మాటా మూఢనమ్మకాలను వ్యతిరేకించే మాటా నిజమే. కాని కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వానికి గాని, దాంట్లో పనిచేయడానికి గాని నాస్తికత్వం ఒక షరతు కాదు. దేవుణ్ణి విశ్వసించేవారు కూడా సభ్యులుగా చేరవచ్చని క్యూబా కమ్యూనిస్టుపార్టీ వంటిది బహిరంగంగానే తన నిబంధనావళిలో ప్రకటించింది. కమ్యూనిస్టులంటేనే దైవ దూషకులు, ద్వేషులు అన్నట్లు చేసే వ్యతిరేక ప్రచారమూ వాస్తవం కాదు. ఇటీవలనే సిపిఐ(ఎం)య అధికార పత్రిక పీపుల్స్ డెమొక్రసీ కూడా దేవుడి పట్ల విశ్వాసం వున్నవారిని తాము అనర్హులుగా పరిగణించడం లేదని వ్యాఖ్యానం వెలువడింది. 1955లో ఆంధ్రలో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో నాస్తికత్వం అనే ప్రచారాన్ని కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ప్రత్యర్థులు బాగా వాడుకున్నారు. ఆ రోజుల్లో చలం కమ్యూనిస్టులు గెలవాలని కోరుకున్నారు. ఇది కూడా ఆయనకు దానిపై వున్న అభిమానాన్నే చెబుతుంది.

చివరగా చలం నాటికలు రెండు జత చేశారు. కమ్యూనిస్టు కార్యకర్తలను పెట్టుబడిదారు కుటుంబ సభ్యులు తర్కంతో తికమక పెట్టడం వీటిలో ఇతివృత్తం. చలం వాదనా పటిమనూ చమత్కారాన్ని తెలియజేసేవే గాని ఇవి పుస్తకంలోని ప్రధాన సారాంశంతో పెద్దగా పొసగడం లేదు.

చలం కలంలో కమ్యూనిజం గురించి చదవడం ఆయనకు ప్రజలపై వున్న ప్రేమను తెలియజేస్తుంది. అలాగే దేశభక్తినే నమ్మలేనన్న అలాటి వ్యక్తిలో కూడా అంతటి ఆశాభావం రేకెత్తించడం కమ్యూనిస్టు భావజాలానికి వున్న శక్తివంతమైన ప్రభావాన్ని ఒకనాడు ఈ దేశంలో దాని ప్రాభవాన్ని తెలియజేస్తుంది. సౌరిస్ చెప్పినట్టు ఆయన ఏదైనా చేస్తే కమ్యూనిస్టులే చేయాలని నమ్మారు. మరి వారు ఈ విధమైన అంచనాలను ఎలా ఏ మేరకు విజయవంతం చేస్తారన్నది వారి ఆలోచనలూ ఆచరణకు సంబంధించిన అంశం. అందుకోసం నిరీక్షించే క్రమంలో తప్పక చదవాల్సిన పుస్తకం ఇది.

**('చలం చింతన సోషలిజం' పుస్తకం ముందుమాట)** ❋

## అక్షర విలాపం

- కట్ల మమత
9652176902

నిశ్శబ్దం!
గ్రంథాలయంలో నిశ్శబ్దం
ముచ్చట గొలుపుతుంది
ఆ నిశ్శబ్దం ఉనికిని వినిపించే
పుస్తకాల పేజీల చప్పుడు కూడా
మూగవోతే మాత్రం
ఆ నిశ్శబ్దం భయంకరంగా ఉంటుంది
బాధగానూ ఉంటుంది
పాఠకుడు వద్దనుకుంటే ఆ తప్పు
పుస్తకానిదే!
అసలు పాఠకుడే లేకుంటే
ఆ నేరం వ్యవస్థదవుతుంది
పుస్తకం నిర్జీవి ఎంతమాత్రం కాదు
దానికి కూడా హృదయం ఉంది
కంటిచూపు సోకని అక్షరం
పడే వేదన భాషకందనిది!
కోటి మెదళ్ళను కదిలించే శక్తిని
కలిగి ఉండి కూడా
నిరుపయోగంగా పడిఉండటం
అడవికాచిన వెన్నెలే అవుతుంది
ఆ వెన్నెలను ఆస్వాదించే సమయం
పాఠకులకు ఈనాడు
లేకుండాపోయింది
ఆదరించే ఔన్నత్యం పాలకులకు
లేదు
మైదానం దాటగానే
అస్తిత్వం కోల్పోయే క్రీడలకు
కోట్ల నజరానాలు
సమాజాన్ని సంస్కరించగల
సామర్థ్యం ఉన్న
సాహిత్యానికి మాత్రం
మెచ్చుకోలు మాటలే బహుమానాలు!
"పాత పుస్తకాలు కొంటాం.." అన్న
అరుపులు
వీధిలో వినపడినప్పుడల్లా
కవి హృదయం కలుక్కుమంటుంది
రచయిత గుండె చెరువవుతుంది
సాహిత్యం కిలోల చొప్పున
అమ్ముడవుతుంటే
కంటతడి పెట్టుకోకుండా ఉండే
కసాయి కవులు ఎవరున్నారు?



బజ్జీ పొట్లంగా మారిన
భావకవితను చూస్తే
ఏ కవి మనస్సు మాత్రం
చివుక్కుమనదు?
రచయిత రైతులా అక్షరాలను
పండిస్తాడు
పంటకు తగిన ధర రాకపోయినా
ఓర్పుగా ఓర్చుకుంటాడు
కానీ ఎవ్వరి ఆకలి తీర్చకుండా
పంట నేలపాలైతే మాత్రం
గుండెలవిసేలా రోదిస్తాడు
ఈ రోదనకు ముగింపు ఎప్పుడో
మళ్ళీ కవి కళ్ళలో వెలుగు
కనిపించేదెప్పుడో
రచయిత రాజయ్యే రోజు
ఏ రోజు వస్తుందో?

❋

## కలయిక

కళ్యాణదుర్గం స్వర్ణలత
98486 26114



కొన్ని మృదు స్పర్శలు
కొన్ని భుజాలను పెనవేసే ఆత్మీయతలు

అంతవరకు
పెదాల సందున నలుగుతున్న మౌనం
ఒక్కసారి వరద కాలువమల్లే ప్రవహించి
పలుకైంది

చూపు చూపుకు మధ్య
విప్పారిన పెదాలు
నవ్వుల వానై కురిశాయి

మెల్లగ మొదలైన సంతోషం అంబరమంతైంది
బాల్యపు గుర్తులు బంధాలకు భరోసాగా వొదిగాయి

చేతిలో బరువుగా వున్న బాధ్యతల సంచీ
ఇప్పుడు మనసుకు మల్లే తేలికైంది

అంతే.. అందరూ కలిస్తేనే ఆనందం

❋



# ఎంతెంత దూరం....?

- డా.యం.ప్రగతి
9440798008

"బర్లో పడితే బర్రున జారిపోవడమే!" ఉద్యోగంలో చేరిన కొత్తలో ఓ సీనియర్ సహోపాధ్యాయుని వ్యాఖ్య. నా ముఖంలో ప్రశ్నార్థకాన్ని చూసి, మరో సీనియర్ క్లారిఫికేషన్, "అదేనమ్మా, ఆగస్టు దాటి సెప్టెం'బర్లో' పడ్డామంటే, కళ్ళుమూసి తెరిచేలోగా డిసెం'బర్' వచ్చేస్తుందని ఆయన మాటలకర్థం."

నిజమే, గత ఇరవై ఏళ్ళుగా - అది హైస్కూలయినా, జూనియర్ కాలేజీ అయినా, డిగ్రీ కాలేజీ అయినా - ఒక జెండా పండగ అయిపోయిందంటే అదుగో ఇదుగో అని సిలబస్ పూర్తి చేసేలోగా రెండో జెండా పండగ వచ్చేసింది. కానీ ఈ సంవత్సరమే నవంబర్ మొదటి వారానికి కామా పడిపోయినట్లుంది. కాలం సాగుతున్నట్లే లేదు. నవంబర్ మొదటివారం చివరిరోజు ఓ మీటింగ్ నిమిత్తం విజయవాడ వెళ్ళి మరుసటి రోజు సాయంత్రం తిరుగు ప్రయాణం కోసం విజయవాడ బస్టాండు చేరాను. పర్సులో చూస్తే ఆటో చార్జి పోను ఇరవై రూపాయలున్నాయి. రిజర్వేషను ముందే చేసుకున్నాను కాబట్టి చార్జీ గురించి దిగుల్లేదు కానీ, మధ్యలో ఏదైనా అవసరమయితే.....? బస్టాండులో ఏ.టి.యం లో కార్డు పెట్టి రెండు వేలకోసం మీట నొక్కాను. రెండు వెయ్యి రూపాయల నోట్లే వచ్చాయి అదేం ఖర్మో! రాత్రి తొమ్మిదన్నరకు ఏదో హోటల్ దగ్గర భోజనానికి బస్సు నిలిపారు. ఏదైనా టిఫిన్ చేద్దామని టోకెన్ కోసం వెయ్యి రూపాయల నోటు తీసీ కౌంటర్ల ఇవ్వబోయాను. "ఆ నోటు తీసుకోం మేడమ్, చిల్లరుంటే ఇవ్వండి". హోటల్ ప్రొప్రయిటర్ నోటు తీసుకోలేదు. "ఎందుకని, చిల్లర లేదా?" నా ప్రశ్నకు సమాధానంగా టీవీ కేసి చేయి చూపించాడు. ప్రొప్రయిటర్. "రద్దయిన 500, 1000 రూపాయల నోట్లు, ఈ అర్థరాత్రి నుంచే అమలు." టీవీ చానళ్ళు హోరెత్తిపోతున్నాయి. "ఈ అర్థరాత్రి నుంచి కదా, ఇప్పుడు తీసుకోవడానికేం?" గట్టిగా అడిగాను. "ఆ తర్వాతయినా మేమెక్కడ మార్చుకోవాలి మేడమ్. ఇప్పటికే ఉన్ననోట్లు ఎలా మార్చాలా అని తల పట్టుకుంటున్నా. ఇంకా తీసుకొని నేనెక్కడ తిప్పలు పడాలి? చిల్లరుంటే ఇవ్వండి, లేదంటే లేదు." తెగేసి చెప్పాడతను. ఊసూరంటూ బస్సెక్కి కూచున్నాను. మధ్యాహ్నం బాగానే తిన్నందువల్ల ఆకలయితే పెద్దగా లేదు కానీ, "ఈ రెండు వేలు ఎలా మార్చాలా బాబూ. అయినా నేను రెండు వేలకే ఇంతగా టెన్షనవుతున్నా, ఇక లక్షలు లక్షలు దాచుకున్న వాళ్ళ పరిస్థితేమిటి?" ఆలోచిస్తుంటే నవ్వొచ్చింది నాకు. అలా అక్రమంగా దాచిన డబ్బు బయటకు రావాలనే కదా ఈ చర్య. మంచిదే కదా! బస్సులో అంతా ఇదే చర్చ. "ఎక్కడెక్కడో దాగిన నల్లడబ్బు కట్టలు కట్టలుగా బయటికొస్తుందనీ, ప్రభుత్వం మంచి పని చేసిందని" కొందరూ,

"అదేం కాదు, పెద్ద పెద్ద వాళ్ళంతా ముందే అంతా సర్దుకొని వుంటారు. మనబోటి సామాన్యులే అగచాట్లు పడేది" అని మరి కొందరూ వాదిస్తున్నారు. నల్లధనం బయటికొస్తే మంచిదేకదా, కొన్నాళ్ళు ఈ కష్టాలు భరించలేక పోతే యెట్లా? నాలో 'దేశభక్తి' నిద్రలేస్తున్నట్లుంది.



మరుసటి రోజు పొద్దున బస్సు దిగాక కానీ నా పరిస్థితి అర్థం కాలేదు. ఆటో కివ్వడానికి చిల్లరలేదు. ఇంటికి చేరాక చిల్లర వెతికి ఆటోవాలకు ఇచ్చాను. గబగబా తయారై కాలేజీకి వెళ్ళడానికి బస్సు కోసం డబ్బులు చూసుకుంటే పర్సు ఖాళీ. పాత పర్సులన్నీ వెతికితే నాలుగొందల చిల్లర తేలింది. బస్సు చార్జీ రోజుకు నూటికి అటూ ఇటూ అవుతుంది. పర్లేదులే, నాలుగు రోజులు సర్దుకోవచ్చు. ఆ తరువాత ఏ.టి.యం.లు ఎప్పుడు తెరచుకుంటున్నాయో, ఎప్పుడు మూసుకుంటున్నాయో తెలియట్లేదు. తెరిచిన వాటిలో క్యాష్ లేదు. పోనీ బ్యాంకు కెళ్దామంటే సెలవు పెట్టాలి. ఆపైన చేంతాడంత క్యూలో నిలబడాలి. డబ్బులున్నా వాడుకోలేని పరిస్థితి. అందుకే నవంబర్ చాలా భారంగా నడుస్తుందన్నాను. ఇంకా ఎన్ని రోజులిలా?

"మేడమ్!" సెకండియర్ బియస్సీ కుర్రాడు దివాకర్ పిలుపు. ఏమిటన్నట్లు చూశాను. "మీరిచ్చిన డబ్బులు" కొత్త పదుల నోట్లు తీసి ఇచ్చాడు. అప్పుడెప్పుడో పరీక్ష ఫీజు కట్టాలంటే నాలుగొందలిచ్చాను. అవి తిరిగి ఇస్తున్నాడు. వాడికి నేను అప్పుగా అనుకోని ఇవ్వలేదు. కానీ ఇప్పుడు నా కళ్ళకు వాడు ఆపద్బాంధవుడిలా కనిపించాడు. కాదనకుండా తీసుకున్నా. "మళ్ళీ నీకెప్పుడయినా అవసరమయితే అడిగి తీసుకో." డబ్బు పర్సులో పెట్టుకున్నాను. మరో నాల్రోజులు దిగుల్లేదు.

నవంబర్ మొదటివారంలో మొదలవ్వాల్సిన సెమిస్టర్ పరీక్షలు యూనివర్సిటీ వారి అలసత్వం పుణ్యమా అని నవంబర్ ఆఖర్లో మొదలయ్యాయి. మూడు గంటలసేపు అటూ ఇటూ తిరుగుతూ భారంగా గడపాల్సిన ఇన్విజిలేషన్ డ్యూటీ అంటే పరమబోర్ నాకు. "ఊరికే తిరగొద్దు మేడమ్! స్టూడెంట్స్ సరంజామా చెక్ చేయండి." కొలీగ్ శ్రీనివాస్ సలహా. అతను చెక్ చేస్తుంటే చూస్తూ ఉన్నా. "మేడమ్ ఇటు చూడండి!" ఒక అబ్బాయి జేబులోంచి రద్దయిన వెయ్యి రూపాయల నోట్లు లక్ష రూపాయల కట్ట చూపించాడు శ్రీనివాస్. ఆశ్చర్యమేసింది నాకు. "అంతడబ్బు పెట్టుకొని పరీక్ష రాస్తున్నాడేంటి? ఎలా మార్చుకుంటాడతను? కుర్రాణ్ణి చూస్తే అతి సాధారణమైన పల్లెటూరి పిల్లాడు." నా ఆలోచనల్లో నేనుండగానే మరో కుర్రాడి జేబులోంచి పది వెయ్యి రూపాయల నోట్లు తీసాడు శ్రీనివాస్. "చూసారా మేడమ్, మన దగ్గర కూడా ఉండదింత డబ్బు." శ్రీనివాస్ మాటల్లో ఆశ్చర్యంతో పాటు అసూయ కూడా ధ్వనించింది. మరో అమ్మాయి పర్సులో 500 నోట్ల రూపాయల కట్ట కనిపించింది. నేనున్న హాల్లోనే దాదాపు డజను మంది దగ్గర పాతనోట్లు వేల రూపాయలున్నాయి. నాకెందుకో వాళ్ళతో మాట్లాడాలనిపించింది. పరీక్ష రాసింతర్వాత వచ్చి కలవమన్నారు.

అన్నట్లు గానే ఆ పిల్లలు పరీక్ష అయిపోయాక వచ్చి కలిసారు. ముందుగా లక్ష రూపాయలున్న కుర్రాణ్ణి అడిగాను. "అంత డబ్బు నీ దగ్గరికెలా వచ్చింది? ఏం చేస్తావు దాంతో?" ఆ పిల్లాడి సమాధానం – "నాల్దినాల్లో మా అక్క పెండ్లి మేడమ్. నెల కిందట్నే మాయప్ప సేను కుదువ బెట్టి ఈ లెక్క తెచ్చినాడు. బ్యాంకోల్లు పెండ్లి కార్డు సూపిచ్చినా రెండు వేలకంటే తీసుకునేకి లేదంటాండరు. ఈ వూర్లో ఒకాయప్ప నూటికిరవై పట్టుకొని కొత్త నోట్లిప్పిత్తాడంట. వచ్చిన కాడికి రానీలే అని మాయప్ప నాకిచ్చి పంపినాడు." 20 శాతం కమీషన్తో నోట్ల మార్పిడి బిజినెస్ జరుగుతోందన్న మాట. మరో అమ్మాయి సమాధానం ఇలావుంది. "మాయమ్మ కూలికి పోయి తెచ్చిన లెక్కల్లో మాయప్పకు తెలకుండా దాసిపెట్టిన దుడ్లు మేడమ్. మాయప్ప కిస్తే సారాయికి తగలేస్తాడని, బ్యాంకు కాడికి పోయ్యేకి తెలక నాకిచ్చినాది. నేను బ్యాంకు కాడికి పోయి మార్చక రావాల." నల్ల ధనం సంగతేమో కానీ ఇళ్ళల్లో ఆడవాళ్ళు తినీ తినక దాచిన డబ్బులు మాత్రం బాగా బయటికొస్తున్నాయని సోషల్ మీడియాలో తెగ జోకులు పేలుతున్నయిామధ్య. ఇక ఇంకో కుర్రాడి సమాధానం విన్న నాకు మతి పోయినంత పనయింది. "మా ఊర్లో పెద్దరెడ్డి మాయప్పకి లెక్కిచ్చినాడు మేడమ్. బ్యాంకులో యేసుకోని మల్లా నెలా రెన్నెల్లకి యిమ్మన్నాడు. మా యప్పకు బ్యాంకులో అకౌంటు ల్యాకపోతే నా అకౌంట్లోకి ఎయ్యమన్నాడు." "మరి నీకు అకౌంటుందా?" నా ప్రశ్నకు

# కంప్యూటర్ ఆపరేటర్

- పి.ఎస్. శ్రీనివాస్
9441307185



వెన్నెముక సింహాసనం మీద కూర్చుంటూ
చేతివేళ్ళు కీబోర్డు మీద నర్తిస్తూ
కంప్యూటర్ మీద వాడి లోకాల్ని ఆవిష్కరిస్తూ
తన వూపిరుల నావిరి చేస్తుంది
తన తాత తట్టలు మోసినా
తండ్రి సెక్యూరిటీ అయినా
తను కంప్యూటరు ఆపరేటరయినా
పనిముట్లలోనే తేడా!
సాయంకాలం ఇంటికి చేరేప్పటికి
దిగులుగుమ్మం మీద తలవాల్చడమే!
పగిలిన పగళ్ళను నెమరేసుకుంటూ
'రేపు'ను కలగంటూ పడుకోవడమే...

❋

---

నన్నో అజ్ఞానిలా చూసాడు వాడు. "నాకు స్కాలర్ (షిప్) అకౌంటుంది గదా మేడమ్. నేనే గాదు, మా వూల్లో సదువుకునే పిల్లోలందరికీ ఇప్పుడు పెద్దరెడ్డి దుడ్లు బ్యాంకులో మార్చే పనే ఇప్పుడు." గర్వంగా ఉన్నాయి వాడి మాటలు. "పర్లేదే అంత నమ్మకంగా ఇచ్చాడంటే. ఎవరైనా ఎగేస్తే...?" నా అమాయకత్వానికి నవ్వాడు వాడు. "యాడుండావు మేడమ్ నువ్వు. మాయప్ప సేను పాస్ బుక్కు పెట్టుకొని ఈ సెల్లని కాయితాలిచ్చినాడు రెడ్డి. మల్లా మేం కొత్త నోట్లిచ్చి పాస్ బుక్కులు తెచ్చుకోవాల. వూల్లో రెడ్డిని గాదని ఏపనైనా సేసేకుందా?" ఈ పిల్లల మాటలతో నాకళ్ళు ఇప్పుడిప్పుడే తెరుచుకుంటున్నాయి. వారం పది రోజుల్లో అంతా సర్దుకుంటుందన్న మాటలు వట్టివేనని తేలిపోయింది.

హమ్మయ్య, నవంబర్ పోయి డిసెంబరొచ్చింది. కానీ ఊపిరి తీసుకొనే వీలింకా చిక్కలేదు. జీతాలు కూడా అకౌంట్లో చేరాయి. కానీ డ్రా చేసుకొనే వీలే లేదు. కొత్తగా నగదు రహిత లావాదేవీలంటున్నారు. కూరగాయలు, పాలు, పనిమనిషి జీతం ఇవన్నీ నగదు రహితంతో సాధ్యమా? ఈ పాలకులు ప్రాక్టికల్ గా ఎప్పుడాలోచిస్తారో ఏమో!

"ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ అసోసియేషన్ సభ్యత్వం కోసం డ్రాఫ్టు తీసావా" సహృదయకురాలిగా మారిన స్నేహితురాలు లత గుర్తు చేసింది. "అవును కదా, మరిచే పోయాను. ఇప్పుడు బ్యాంకుకు పోతే ఎంతసేపవుతుందో ఏమో, నాకు నెక్స్ట్ పీరియడ్ క్లాసుంది, రాగలనా?" "బ్యాంకులో ఎవరో తెలుసన్నావు కదా ట్రై చేసి చూడు." సలహా ఇచ్చింది లత. బ్యాంకు మేనేజర్ రామ్మోహన్ నాకు పాత స్నేహితుడే. ఫోన్ చేసి విషయం చెప్పాను. "పర్లేదులే రా, తీసిస్తాను." రామ్మోహన్ అభయమిచ్చే సరికి బ్యాంకు దగ్గరకు చేరాను. బ్యాంకు బయట ముప్పయిమంది పైగా క్యూలో వున్నారు. నేరుగా లోపలికికెళ్ళబోతుంటే ఓ ముసలాయన అడ్డుకున్నాడు. "ఏమ్మోవ్, ఇంతమంది ఈడ నిలబడిండేది కనిపీలేదా? సర్రున లోనికి దూరతాండావు." కరచినంత పన్జేసాడు. "డబ్బులు డ్రా చేయడానికి కాదులే పెద్దాయనా, డ్రాఫ్టు తీసుకోవాలి." మెల్లగా చెప్పబోయాను. "ఏదానికైతేనేమి? సేసే పని ఒక్కరే గదా. మట్టసంగ మా యనకాల లైన్లో రా." మరొకతను కసిరాడు. "నాకు కాలేజీలో క్లాసుందండి. త్వరగా వెళ్ళాలి బ్రతిమాలుకున్నా వినలేదు. "మేమంతా ఏ పనీ ల్యాక నిలబడినామను కుంటుండావా? బోగు సెప్పినావులేమ్మా పాటాలు. పద్దన తొమ్మిది కాన్నించి ఈడ పడిగాపులు గాస్తాండము. మూడు దినాలనుంచి ఇదే కత. మాదుడ్లు మాకిచ్చేకి ఈయప్ప గార్లకేం పోగాలమో? ముసలిమోపున మాకు సచ్చే సావొచ్చింది. ఈ యమ్మ ఇప్పుడొచ్చి సర్రున లోనికి పోతావుంటే ఈడంతా పన్లేని నాకొడుకులందారు." డబ్బు రాలేదనే అసహనన్నంతా నామీద చూపించారు. ఇక కుదిరే పని కాదని రామ్మోహన్ కు ఫోన్ కలిపాను. "నా అకౌంటు నంబరు, డి.డి. తీయాల్సిన అడ్రసు మెసేజ్ చేస్తాను. రెండొందల యాభై రూపాయలకు డ్రాఫ్టు తీసిపెట్టు. కాలేజీ నుంచి వెళ్ళేటప్పుడు తీసుకుంటాను." మెసేజ్ పెట్టి వెనక్కి తిరిగాను. క్యూ మరింత పొడవయింది.

చిన్నప్పటి ఆట గుర్తొచ్చింది. "ఎంతెంత దూరం...?" "చాలా చాలా దూరం..!" అంటూ సరదాగా సాగిందా ఆట. ఎవరో సరదాగా ఆ మొదలెట్టిన అహంకారపు ఆట భారంగా సాగుతోంది. ఎంతెంత దూరం....? ఇంతింత భారం.... ఇంకెంత కాలం......?

❋

## టార్గెట్



- ఎస్.ఆర్.పృథ్వి
9989223245

కత్తిని పీకమీద పెడితే
చేసే పనిలో వేగం పెరగొచ్చు
నైపుణ్యం మాత్రం కూలిపోతుంది
నిర్ణయించబడిన రేఖను దాటేందుకు
వంటిలోని నెత్తురు మరుగుతుంది
మెదడులోని కణాలు కొన్ని
కొత్త ఆలోచనల వైపుగా పరుగులు తీస్తాయి
క్రమాతీత పద్ధతుల కోసం కొన్ని
వెతుకులాటలో పడతాయి

సమయం దగ్గరపడేకొద్దీ
గుండెవేగం పెరిగి
అడుగుల్లో తడబాటుతనం
ముమ్మరమౌతుంది
గీచిన రేఖను దాటేప్రయత్నం
మనిషిని, స్థిరంగా నిలువ
నీయదు

నిబంధనాక్షరాలు
ఆకాంక్ష గాలికి చెదిరిపోతాతాయి
ఆదరాబాదరాగా గీత దాటేసి
ఒక్కసారి ఊపిరి పీల్చుకుంటాడు
వాడి ప్రయాణంలో నాణ్యత ఎంతుందో
వాడికి బాగా తెలుసు, అయినా
ప్రయోజనం శూన్యంలో వ్రేలుడుతుంది
టార్గట్‌ని చేరుకోవడమే ముఖ్యం
నష్టమంటూ ఏదైనా జరిగితే...
కారకులెవరౌతారు?!

*

## కవి హృదయం

పి. లక్ష్మణ్‌రావ్ ,
9441215989



సూర్యుడు నిద్రలేవకముందే
అతడు మేల్కొని
కవితాపక్షియై మనముంగిట
వాలడం కోసం
అక్షరదారులు వేసుకుంటాడు!
అతడి పిలుపు
కోడికూతలా కొందరికి వినిపిస్తే
కాకిగోలలా మరికొందరికి అనిపిస్తుంది
అతడు పాడేది
సుప్రభాతగీతమూ కాదు
జోలపాట అసలే కాదు!
స్పందించే అతడి కవిహృదయం
విశ్వవీక్షణం చేసి మోసుకొచ్చిన
గంపలోని భావాలను తీస్తుంటే
ఒక్కొక్కటి ఒక్కొక్క శబ్దం చేస్తుంది!
ఇలా....
ఆర్థిక సంబంధాల మధ్య
నలుగుతున్న భావోద్వేగాల
మౌనరోదన!
దారుణ మారణ హోమాలకు
రగులుతున్న గుండెల్లో
ఎగిసిపడుతున్న జ్వాలల చప్పుడు!
దిగుమతైపోయిన
క్లబ్బు పబ్బుల వికృత నాట్యానికి
విలపిస్తున్న విలువల దీనరాగాల రొద!

కార్పొరేట్ కుట్రదారుల నిర్వహణలో
వత్తిడికి బలైపోతున్న
వేతనదారుల హృదయఘోష!
విలాసాల్లో తేలియాడుతూ
ఆకాశంలో విహరిస్తున్న
ధనవంతుల పరమానందాల నాదం!
యాంత్రాల మధ్యే తెల్లారిపోతూ
అరిగిపోతున్న
కార్మికుల బతుకు చప్పుడు!
అంతర్జాల వ్యామోహంతో
యువత భవిష్యత్తు
నిర్వీర్యమైపోతున్న అలికిడి!
స్వేదంతో పండించిన పంట
గిట్టుబాటుకాక గాలిలో దీపమై
ఆరిపోతున్న నిశ్శబ్ద శబ్దం!
కపటప్రియుల వలల్లో బలైపోతున్న
అమాయక యువతుల
ఆక్రందనల ఘోష!
ఒక్క ఉద్యోగం కోసం పోటీపడుతున్న

వేలమంది నిరుద్యోగుల
నిరాశా నిట్టూర్పుల దీనధ్వని!
నల్లధనం పేరుకుపోయి
గొప్పమనుషులుగా దోపిడీదారులు
తిరుగుతున్న అడుగల శబ్దం!
ఇలా ఒక్కటేమిటి
అనేక భావాల గంపను ఖాళీచేసేసరికి
కవిత పూర్తయిపోయి
మన ముంగిట ప్రతిధ్వనిస్తుంది!
కోడి కూతగానో....
కోకిల గానంగానో....
కాకి గోలగానో....!

*

# శ్రమే తప్ప ఫలితం దక్కని గుత్తసేద్య ప్రతిఫలనం 'మునికన్నడి సేద్యం'

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117




*'మునికన్నడి సేద్యం' గుత్త సేద్యంలోని వెలుగు చీకట్లను చిత్రించిన నవల. దున్నేవాడిదే భూమి అనే నినాదం పాలకుల పుణ్యమా అని దున్న గలిగే వాడిదే భూమిగా మారిపోయిన నేపథ్యంలో నామిని నవలకు చాలా ప్రాముఖ్యముంది. గ్రామీణ ఆర్థిక జ్ఞానం అక్కడి భూ సంబంధాలు, వ్యవసాయ శాస్త్రం, గ్రామీణ ప్రజల ఆలోచనలు, ఆచరణలు పూర్తిగా తెలిస్తే తప్ప, వాటిల్లో అభినివేశం ఉంటే తప్ప 'మునికన్నడి సేద్యం' నవల రాయడం సాధ్యం కాదు. మిట్టూరు చినబ్బ నామినికి ఈ పరిజ్ఞానమూ, అనుభవమూ పుష్కలంగా ఉన్నాయి. కల్తీ లేని గ్రామీణ రచయిత నామిని.*

**A work of art is expressive when it was conveys more than it represents (Y. Khachikyan: On the question of expressiveness and representativeness)**

నామిని సుబ్రహ్మణ్యంనాయుడు రచించిన నవల 'మునికన్నడి సేద్యం'. ఇది 1989లో సీరియల్‌గాను, 1990లో పుస్తకంగాను వచ్చింది. ఈ నవల గుత్తసేద్యం (కౌలు వ్యవసాయం) లోని శ్రమను, దాని ఫలితాన్ని ఆవిష్కరించింది. రచయిత ఊరైన మిట్టూరు ఈ నవలలో కథాక్షేత్రం. బహుశా ఈ నవలలోని పాత్రలు రచయితకు బాగా తెలిసినవే అయ్యుంటాయి. భూమి కలిగిన రైతుల జీవిత పరిణామాలను చిత్రించిన సాహిత్యం భారతీయ భాషలలో పుష్కలంగా వచ్చింది. అలాగే వ్యవసాయాధారిత వృత్తిదారుల, కూలీల జీవితాల వస్తువులుగా కూడా చాలా సాహిత్యం వచ్చింది. కాని గుత్త రైతు మీద మాత్రం రచనలు వచ్చినట్లు లేదు. మరాఠీలో హరినారాయణ ఆప్టే రచించిన 'మట్టిమనుషులు', కన్నడంలో 'కె. శివరామకారంత్ రాసిన 'మరల సేద్యానికి' చోపుని డప్పు' తెలుగులో వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'మట్టిమనిషి' నవలలు గొప్పవే అయినా 'మునికన్నడి సేద్యం' వాటికన్నా విభిన్నమైన, విశిష్టమైన నవల. గుత్త రైతు శ్రమను, దాని ఫలితాన్ని అత్యంత వాస్తవికంగా చిత్రించడమే దాని విశిష్టత.

సేద్యం మూడు రకాలుగా ఉంటుంది. 1. కూలి సేద్యం 2. సొంత సేద్యం 3. గుత్త సేద్యం. ఎక్కువ భూమి కలిగిన రైతులు కూలీలతో చేయించేది కూలి సేద్యం. పరిమితమైన భూమిలో రైతులు స్వయంగా కష్టపడి చేసేది సొంత సేద్యం. సొంత భూమి లేని వాళ్ళు ఇతరుల భూమిని గుత్తకు తీసుకుని పండించి యజమానికి గుత్త చెల్లించి మిగిలింది తీసుకోవడం గుత్త సేద్యం. 'మునికన్నడి సేద్యం' గుత్త సేద్యంలోని వెలుగు చీకట్లను చిత్రించిన నవల. దున్నేవాడిదే భూమి అనే నినాదం పాలకుల పుణ్యమా అని దున్న గలిగే వాడిదే భూమిగా మారిపోయిన నేపథ్యంలో నామిని నవలకు చాలా ప్రాముఖ్యముంది. గ్రామీణ ఆర్థిక జ్ఞానం అక్కడి భూ సంబంధాలు, వ్యవసాయ శాస్త్రం, గ్రామీణ ప్రజల ఆలోచనలు, ఆచరణలు పూర్తిగా తెలిస్తే తప్ప, వాటిల్లో అభినివేశం ఉంటే తప్ప 'మునికన్నడి సేద్యం' నవల రాయడం సాధ్యం కాదు. మిట్టూరు చినబ్బ నామినికి ఈ పరిజ్ఞానమూ, అనుభవమూ పుష్కలంగా ఉన్నాయి. కల్తీ లేని గ్రామీణ రచయిత నామిని.

తిరుపతి పడమరగా ఇరువై అయిదు కిలోమీటర్ల దూరంలో ఉన్న రంగంపేట నుండి ఇలామంతునాయుడు కుటుంబం, తిరుపతికి దక్షిణంగా అరేడు కిలోమిటర్ల దూరంలో ఉన్న

మిట్టూరుకి వలస వచ్చి, అద్దాలామె అనే వితంతువు పొలాన్ని గుత్తకు తీసుకుని ఇంటిల్లపాది సేద్యం చేయడం, ఆ సేద్యంలో శ్రమ, అందుకు దక్కిన ఫలితం ఈ నవలలో వస్తువు. ఇలావంతునాయుడు మిట్టూరుకు అల్లుడే. ఆయన భార్య వెంకటమ్మ మిట్టూరు ఆడబిడ్డ. గురప్పనాయుడు ఆమెకు అన్న. 'మాలమాదిగ'లకు కూలీలిచ్చి సేద్యం చేయించుకోలేక అద్దాలామె పొలాన్ని గుత్తకిచ్చేసి తిరుపతిలో కాపురం పెట్టి కొడుకును చదివించుకోవాలనుకుంటుంది. ఆమే గురప్పనాయుడిని పంపించి ఇలామంతునాయుడు కుటుంబాన్ని అడుక్కు రమ్మంటుంది. ఇలామంతు నాయుడు పేరుకు ఆధిపత్య కులానికి చెందిన వాడైనా తనదంటూ చారెడు నేల లేని వాడు. కాడెద్దులు ఒక మడక మాత్రం ఉన్నాయి. బాడుగ మడకలు దున్నుతూ బతుకు సాగిస్తున్నాడు. ఇంట్లో అందరూ శ్రమ చేసేవాళ్ళే. మిట్టూరులో నూటికి పదిరూపాయలు వడ్డీ సంపాదించే కమ్మవాళ్ళున్నారు. ఇలామంతు మాత్రం శ్రమ తప్ప ఇంకేమీ తెలియనివాడు.


నామిని సుబ్రహ్మణ్యం నాయుడు

*ఈ నవల స్వాతంత్ర్యానంతరం భారతీయ గుత్తరైతు జీవితానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. నవలలోని అంతర్గత ఆధారాల ద్వారా ఈ నవల చారిత్రక నేపథ్యాన్ని, కథాకాలాన్ని గుర్తించవచ్చు.*

ఈ నవల స్వాతంత్ర్యానంతరం భారతీయ గుత్తరైతు జీవితానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. నవలలోని అంతర్గత ఆధారాల ద్వారా ఈ నవల చారిత్రక నేపథ్యాన్ని, కథాకాలాన్ని గుర్తించవచ్చు. నవల ప్రారంభంలోనే వెంకటమ్మ మాటలవల్ల ఇలామంతు వెంకటమ్మల పెళ్లి జరిగి ముప్పై ఏళ్ళయింది. 1989 నుంచి ముప్పై ఏళ్ళు వెనక్కి వెళ్ళితే వాళ్ళ పెళ్లి 1959లో జరిగి ఉంటుంది. ఇలామంతు నాయుడుకి ఆ రోజుల్లో 18 ఏళ్ళకు పెళ్ళియిందనుకుంటే అతను 1941 ప్రాంతంలో పుట్టి ఉంటాడు. క్విట్టిండియా ఉద్యమ కాలం అది. వాళ్ళకు 1967-1988 మధ్య 15 ఏళ్ళలో ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుర్లూ పుట్టారు. ఇలామంతునాయుడు స్వాతంత్ర్యోద్య కాలంలో పుడితే, ఆయన సంతానం 1967 ప్రాంతం నుండి స్వాతంత్ర్యఫలాలను అందుకొని ఒక నయా సంపన్న వర్గం ఆవిర్భవించిన కాలంలో పుట్టారు. కాని వాళ్ళందరూ భూమిలేని నిరుపేద కష్ట జీవులుగానే మిగిలిపోయారు. అప్పటికే భూసంస్కరణలు అమలైనా వీళ్ళు మాత్రం భూమిలేని వాళ్ళుగానే మిగిలిపోయారు. ఇదొక విషాద చిత్రం. ఈ నవల ప్రారంభమయ్యే నాటికి తిరుపతికి చుట్టుపక్కల గ్రామాల ప్రజలు తిరుపతిలో అనేక వ్యాపకాలతో తిష్ట వేస్తున్నారు. అద్దాలామె తిరుపతి చేరితే ఇలామంతునాయుడు పల్లె చేరాడు.

ఈ నవలలో మనకు కొట్టొచ్చినట్లు కనిపించేది ఇలామంతు నాయుడు భార్యాబిడ్డల శ్రమ స్వభావం. వరి పైరు నాటడం, కలుపు తియ్యడం వంటివి వదిలిపెడితే తక్కిన పనులన్నీ వాళ్ళే చేసుకున్నారు. చాద వెయ్యటం, నారు వదలటం, నారు పెరకటం, నాట్నానికి నారు కట్టలు వెయ్యటం, అడవికి పోయి ఆకు కోసుకురావడం, అందరూ పోయి పేడ ఏరుకుని రావడం, గడ్డివామి వెయ్యడం- వాళ్ళకు చేతగాని పనిలేదు. చద్ది సంగటే వాళ్ళకు ఆహారం. అత్యవసరమైనప్పుడు పరిమితంగా కూలీలను పెట్టుకుంటారు. బదులు సేద్యం చేస్తారు. ఇంటిల్లపాది కష్టించి మూడున్నర ఎకరాలలో వరి పైరు వేశారు. వడ్లు బాగా రాలాయి. ఖర్చు, ఆదాయం లెక్కవేస్తే వాళ్ళకు మిగిలింది అప్పే. ఇలామంతు నాయుడు మాటల్లో "మన రెక్కల కష్టం ఏడేలు. మనకు గిట్టుబాటు కలిగింది అయిదేలు. మనకు రెండేలు నష్టం" అప్పటికే వ్యవసాయం లాభదాయకం కానిదైపోయింది. గురప్ప నాయుడు మాటల్లో "ఈ కాలం యెవసాయంలో ఏమి వస్తా వుండాది. ఎంత జేసినా రాతిమింద సేద్యం గానే వుండాది" తొలి ఫలితంతో రెండు వేలు నష్టపోయిన కుటుంబం, రెండో ఫలితంలో చెరుకు, వేరుశనగ, వరి పైరు వేశారు. ఒరుపు వచ్చింది. కరెంటు కోత వచ్చింది. బాడుగ నీళ్ళు పారించినా వేరు శెనగ ఎండిపోయింది. తర్వాతి ఫలితంలో పోసిన నారే ఎండిపోయింది. చివరికి ఆ కుటుంబానికి దక్కింది ఒక ఎద్దులబండి, రెండావులు. ఇలామంతునాయుడు బండెక్కాడు. పెద్దకొడుకు మునికన్నడు చెక్‌డ్యాం పనులకు వెళ్ళాడు. రెండో కొడుకు ధర్మడు కొయ్యమిల్లులో పనిలో చేరాడు. ఆఖరుకి రేషన్ బియ్యం కొనుక్కొని తినే పరిస్థితి వచ్చింది. ప్రకృతి, పాలన రైతులను భూమి నుంచి దూరం చేశాయి. ఇదీ ఈ నవలలో గుత్తరైతుల జీవిత పరిణామం.

వ్యవసాయ సమాజంలో ఆర్థిక ఆకాంక్షలు ఎలా ఉంటాయో 'మునికన్నడి సేద్యం' నవల వాస్తవికంగా ఆవిష్కరించింది. అద్దాలామె తన భూమిని గుత్తకు చేసుకోమనే ఇలామంతునాయుణ్ణి రంగంపేట నుంచి మిట్టూరికి

పిలిపించింది. వాళ్ళు రాగానే కూలీలుగా పనిచేయమంది కాకుంటే జీతగాళ్ళుగా పని చేయమంది. ఇలా ఎందుకు చేసిందంటే గురప్పనాయుడి మాటల్లో "గుత్త ఒకటికి రెండంతలు దొబ్బుదామని" ఆ తర్వాత ఆమె గుత్తకే తీసుకోమంటూ భూమి, నీళు ళ్ళ, కరెంటు తనవిగా నీకు పండిన పంటలో రెండు వంతులు తనకిచ్చి, ఒకవంతు ఇలావంతునూ తీసుకోమంది. బేరాలు జరిగి జరిగి చివరికి మూడున్నర ఎకరాలకు ఫలితానికి ఇరవైఅయిదు మూటలు గుత్తకు ఒప్పుకొనింది. అద్దాలామె వీలయినంత ఎక్కువ రాబట్టుకోవాలనే రాజనీతిని ప్రదర్శించింది. గురప్ప తన వాద పటిమతో ఆమెను దారికి తెచ్చుకున్నాడు.

***ఈ నవలలో మధ్య తరగతి సంస్కారానికి దిగ్భ్రమ కలిగించే అంశం పాత్రలు మాట్లాడే భాష. చాలా మొరటుగా, బండగా ఉన్నట్లు అనిపించే భాష. మనుషులు ఇలా ఎక్కడన్నా మాట్లాడుకుంటారా అనిపిస్తుంది.***

అద్దాలామె పొలం 50 గుంటలు. మూడున్నర ఎకరాలు. కాని పైరు నాటడానికి వచ్చిన కూలీలు అది 60 గుంటలంటారు. మునికన్నడు 50 గుంటలే అంటాడు. అద్దాలామె భూమి మాకు కూడా తెలుసునని చెప్పి దళిత కూలీలు దానిని నాటడానికి 50, 55 మంది కూలీలు పడతారంటారు. ఆఖరికి 45 మంది కూలీలు పడతారు. సరేనా అంది ఒకామె. చివరికి 33 మంది కూలీలకు ఒప్పుకున్నారు. ఒప్పందం కుదిరినాక 27 మంది కూలీలే వచ్చారు. అదేమాని అడిగిన మునికన్నడితో "మేము నలగరమే వస్తాం. దాంతో నీకేంపని పొద్దుబార నుండగానే పనికాకుంటే అప్పుడడుగు" అని ఒకామె దబాయించింది. పని చేయించుకునే వాళ్ళు సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో చేయించుకుందామనుకుంటారు. పని చేసేవాళ్ళు సాధ్యమైనంత ఎక్కువ రాబడదామనుకుంటారు. ఇదీ ఇందులోని ఆర్థిక సూత్రం.

సేద్యంలో మూడు రకాలు ఉంటాయని అనుకున్నాం. వాటిలో సొంత సేద్యం, గుత్త సేద్యంలలో కలిపి మరొక రకమైన సేద్యముంది. అది బదులు సేద్యం. అది వస్తుమార్పిడి పద్ధతి వంటిది. 'మునికన్నడి సేద్యం' నవల బదులు సేద్యాన్ని మనకు పరిచయం చేస్తుంది. ఒకరు ఒకరోజు ఇంకొకరికి పొలంలో పనిచేస్తే, వారు వారికి మరో రోజు అదే పని చేయడం బదులు సేద్యం. చెంగమనాయుడు (ఒంటోడు) మునికన్నడు ఇలా బదులు సేద్యం చేస్తారు నవలలో. చెంగమనాయుడు ఎరువును మునికన్నడు బండికెత్తి పోస్తే, ఆయన ఎద్దులు మునికన్నడికి ఇస్తాడు చెంగమనాయుడు. వారి పైరులో కలుపును మునికన్నడు ఇంట్లో వాళ్ళంతా తీస్తే మళ్ళీ ఆయన తన ఎద్దులు వాళ్ళకిస్తాడు.

కొన్ని సందర్భాలలో అయిన వాళ్ళ కన్నా ఇతరులే మేలనిపిస్తారు గ్రామాలలో. వెంకటమ్మ గురప్పనాయుడి చెల్లెలు. కొడవళ్ళు కావాలని గురప్ప భార్యను వెంకటమ్మ అడిగితే ఆవె యాడుండాయి? అంటుంది. అదే పక్కింటామె అడగ్గానే నాలుగు కొడవళ్ళు ఇస్తుంది.

ఈ నవలలో మధ్య తరగతి సంస్కారానికి దిగ్భ్రమ కలిగించే అంశం పాత్రలు మాట్లాడే భాష. చాలా మొరటుగా, బండగా ఉన్నట్లు అనిపించే భాష. మనుషులు ఇలా ఎక్కడన్నా మాట్లాడుకుంటారా అనిపిస్తుంది. కుటుంబంలో భార్య, భర్త, వాళ్ళ సంతానం ఎలా మాట్లాడుకోవాలో ఒక నియమం ఉంది. ఈ నవలలో ఇలామంతునాయుడు, వెంకటమ్మ, మునికన్నడు, ధర్మడు, నాగరాణి పరస్పరం బాగా ప్రేమతో ఉంటారు. కాని చాలా సమయాలలో వాళ్ళ మాటలు నాగరిక ప్రపంచానికి ఆశ్చర్యం కలిగిస్తూ ఉంటాయి. వెంకటమ్మ తన భర్త ఇలామంతును అనేక పర్యాయాలు పూచికపుల్లతో సమానంగా తీసేసి మాట్లాడుతుంది. తాను చెయ్యాలనుకున్న పనికి అడ్డుపడుతున్న భర్తను "నీ మొకాన అగ్గిబెట్ట. దరిద్రుడా! నిన్ను కట్టుకోని ముప్పైయేండ్లు కావస్తా వుండాది. పద్మూడేండ్ల ప్రాయంలో నీ ఎదాన తోసినారు. ఏ పొద్దన్నా సంసారం రక్తికట్టిందా!" అంటుంది. తొలి ఫలితంలో వచ్చిన ఆదాయ వ్యయాలను లెక్క వేస్తున్న సమయంలో "యింగజాల్లే రెండూ రెండు చేతుల్తో మూసుకోని పొనుకో. బొక్క తెరిస్తే ఒప్పుకునేదిలా" అని దబాయించేస్తుంది. ఆవును అమ్మకానికి పెట్టిన సందర్భంలో ఆమె చాలా తీవ్రంగా మాట్లాడుతుంది. "ఈ కోతి మొకం యెదవ చేష్టలు తలుచుకుంటే మునికన్నా! ఈ మొగోడి చేత యేలు తొక్కించుకొని బొట్ట కట్టించుకున్నప్పటి నుంచి ఈ వాటంతోనే గదరా ఈ దరిద్రుడితో యేగతా వుండేది?" అంటుంది. రచయితే అన్నట్టు "తగరారు మొగుడితో ఆడడంలో యెంగటమ్మకు మించిన ఆడామె ఈ కలిగ్గంలో వుండదు". వెంకటమ్మ భర్తనే కాదు దేవుణ్ణి, కరెంటు చార్జీలు వసూలకు వచ్చిన వాళ్ళను కూడా అలాగే మాట్లాడుతుంది. వెంకటేశ్వరస్వామి అంటే ఆమెకు భక్తే. మొక్కుబడులు మొక్కుకుంది. తీర్చింది. కాని కరెంటు కోతలు వచ్చి పైరు ఎండిపోతా ఉంటే, తిరుమల మీద నిరంతరాయంగా దీపాలు వెలగటం చూసి "నా బట్టా దేవుడా! నీ కొండకు వుండే కరెంటు

# నానీలు

- పాలపర్తి ధనరాజ్
9550593901

నిత్య ప్రయాణం
పచ్చ తోరణం
రోడ్లమీద
ఆటోలు

పైసా పెట్టుబడి
లేని
ఒకే ఒక మాట
ఐలవ్ యూ

మొక్కనాట్లు
సాగిపోతున్నాయి
మొక్కకి నీళ్లే
ఆగిపోతున్నాయి

చెట్లకి చెట్లే
కూలిపోతున్నాయి
ప్లాట్లకి ప్లాట్లే
మొలివెత్తున్నాయి

అందరూ మాట్లాడమనేది
అచ్చ తెలుగు మాటలు
అందరో మాట్లాడేటి
అచ్చ ఆంగ్ల మాటలు



చెవుల్లో మొగ్గలు
బళ్ళో తీగెలు
జేబుల్లో సెల్లు
యువత జోర్లు

బైక్ మీద ట్రిబుల్స్
బైక్ మీద ఫోన్ చాట్స్
బైక్ మీద స్మోకింగ్
ప్రేక్షకులు? ఆ ఒక్కటే అడక్కు

గుళ్లు పోయాయి
పెళ్లిళ్లకి
కాళ్ళొచ్చాయి
ఫంక్షన్ హాళ్లోకి

అధికారానికే
పార్టీలు వేరు వేరు
అవినీతికే
పార్టీలన్నీ బలాదూరే

❋

మా పైరుకు లేకపాయ గదరా కూలిపోయిన దేముడా!" అనగలిగింది. కరెంటు కోతలతో రైతులు అల్లాడిపోతుంటే, ఆ సమయాల్లో కరెంటు ఛార్జీలు వసూలుకు వచ్చిన వాళ్ళ మీద వెంకటమ్మ ఎగిరిదూకింది. వాళ్ళు పోలీస్ కంప్లెయింట్ ఇస్తామంటే 'ఇచ్చుకో బో రా నా బట్టా! పోలీసోళ్ళకు గాకుంటే వాళ్ళమ్మా ముండగాళ్ళ కిచ్చుకోబో. నా యెంటిక గూడ పెరుక్కోలేరు" అంటుంది.

మునికన్నడికి అమ్మంటే ప్రాణం. అయినా వెంకటమ్మ లచ్చుములతో తిట్టించుకొని వచ్చి బాధపడుతుంటే "నువ్వు బో నియ్యమ్మా అష్ట దరిద్రప నాయాల ముండా" అంటాడు. పొలంలో వరిపైరు నాటడానికి వచ్చిన కూలీలలో ఒకామె, గుంటలు తక్కువ చెప్పిన మునికన్నడిని "రంగంపేట నుంచి వచ్చిన మా మేనమామ కొడకా! నీకు అద్దాలామె కయ్యి ఈ రోజు కొత్త. మాకది బలే పాతగాని నువ్వు రెండూ రెండు చేతుల్తో మూసుకో" అని యాసండం పడింది. ఇంకా కొన్ని సమయాలలో మునికన్నడు, ధర్మడు, నాగరాణి ఇలాగే మాట్లాడతారు. ఈ మాటలు గ్రామీణ, జీవితపు లోతులు తెలిసిన వాళ్ళకు చాలా సహజంగా అనిపిస్తాయి. తెలియని వాళ్ళకు ఎబ్బెట్టుగా అనిపిస్తాయి. రచయిత గ్రామీణ జీవిత వాస్తవికతను అక్కడి భాషలోనే వ్యక్తం చేశాడు.

ప్రపంచీకరణ ప్రవేశానికి ముందటి చిత్తూరు జిల్లా గుత్త సేద్యానికి ఈ నవల అద్దం పట్టింది. ఈ పజ్జెనిమిదేళ్ళలో దేశమంతా మారినట్లే మిట్టూరు కూడా మారింది. అక్కడ కూడా భూమి ఇవాళ అంగడి సరుకైంది. అక్కడి మానవ సంబంధాలు మారాయి. ఇలామంతునాయుడు ఇప్పుడు 75 ఏళ్ళు దాటుంటాడు. వెంకటమ్మ 70 ఏళ్ళు పైబడి ఉంటుంది. మునికన్నడు 40 ఏళ్ళ వయసులో ఉంటాడు. ధర్మడు 38 ఏళ్ళ వయసులో ఉంటాడు. వీళ్ళందరూ చూస్తుండగానే మిట్టూరు మారిపోయి ఉంటుంది. అద్దాలామె తిరుపతిలో ఏమైంది? గురప్పనాయుడు ఎద్దులబండి ఏమైంది? ఒంటోడు ఏమయ్యాడు? ఈ రెండు దశాబ్దాల పరిణామాలను నామిని సుబ్రహ్మణ్యం నాయుడు మరో నవలలో చిత్రించగలిగితే మన దేశాన్ని మన పాలకులు ఎటు తీసుకు పోతున్నారో తెలుస్తుంది. చెరుకు ఫ్యాక్టరీలు, పాలడైరీలు అదృశ్యమై పోయాయి. రైతు భూమికి దూరమై సారాయి కాంట్రాక్టరో, రోడ్డు కాంట్రాక్టరో అయిపోయాడు. అడవిని ఏదో కంపెనీ కంపెనీలో, కార్పోరేట్ సంస్థో వచ్చి దిగేసి ఉంటుంది. బావులలోని బోర్లూ దిగేసి ఉంటాయి. ఆ బోర్లు కూడా ఎండిపోతూ ఉంటాయి. ఇంకా చాలా మార్పులు వచ్చి ఉంటాయి. అందువల్ల ప్రపంచీకరణ మిట్టూరును నామిని నవలీకరించటం నేటి అవసరం.

**A work of art is expressive when it was conveys more than it represents (Y. Khachikyan: On the question of expressiveness and representativeness. An essay in Marxist Leninist aesthetics and Life P.114)**

❋

# సహజ సూత్రం

- పిల్లా కుమారస్వామి
8106432949




గ్రహాలు సౌరకుటుంబాలు
నక్షత్ర మండలాలు
నెబ్యూలాలు కృష్ణబిలాలు
ఒకటేమిటి సమస్త బ్రహ్మాండం
విశ్వాకారమై ఎటో వెళ్ళిపోతోంది
మనిషి మనసు విశ్వంతో లయమై
కళ్ళెం లేని గుర్రపుడెక్కల చప్పుడులో
కలిసి పోయింది
కాలాన్ని పట్టుకునేందుకు విశ్వయత్నం
చేసి
మహావిస్ఫోటనం వద్ద కాలాన్ని
అధిరోహించాడు
ఏదో శక్తి
అదే గురుత్వాకర్షణ తరంగశక్తి
ఆకర్షణ వికర్షణల వైరుధ్యశక్తి
సౌరకుటుంబాన్ని ఒకే కుటుంబంగా
నిలబెడుతోంది
ఏదో బంధం
అదే ఆత్మీయతానుబంధం
ప్రేమద్వేషాల సమన్వయం
మానవ కుటుంబానికి ఏకసూత్రమై
వసుధైక కుటుంబాన్ని ఆవిష్కరిస్తోంది
మానవ అస్తిత్వానికి తొలివెలుతురు
భూగోళం పై సముద్రం లో
ఏకకణ రూపమై వెలసింది
పంచ భూతాల లయలో
ఏక కణం బహుకణమై
ప్రొటో ప్లాజం నుంచి ప్రాణస్పందన
పొందింది
లతలు తరులు సరీ సృపాలు సూక్ష్మ
స్థూల జీవులు
బహు ముఖాలుగా జీవం విస్తరించింది
జీవకోటి ఇతిహాసం లో
హెూమో సెపియన్ నిలుచున్నాడు
మానవుడై
ప్రకృతిలో తననుతాను చూసుకుంటూ
తన మస్తిష్కం లో జరిగే కల్లోలాలను
ఒడిసి పట్టుకునేందుకు ఎన్నోఎన్నెన్నో
విన్యాసాలు చేశాడు
ప్రకృతిలో విలీనమౌతూ
సరిగమల గమకాలలో కవితాగానం
చేశాడు
చిత్రాను భూతుల స్పందనలను చిత్రం
లో బంధించాడు
ప్రకృతితో అలీనమౌతూ
అదుపు సాధిస్తూ ఎదిగాడు మృత్యుం
జయుడై
ఒక్కోసారి అదుపు కోల్పోయి దిగంతాల
కావల నిలబడి అర్థిస్తున్నాడు మహాశక్తికై
చక్రం మానవ పురోగమన చరిత్రలో
ఒక మైలురాయి
కదలిక జీవకోటికి ప్రాణ ప్రదం
చక్రం తిప్పిన మనిషి
జగతిని మరోమలుపు తిప్పేందుకు
కేంద్రకాన్ని బద్దలు కొట్టాడు
ఎలక్ట్రాన్ ప్రోటానుల విన్యాసంలో
పరస్పరవైరుధ్యం లో తన్ను తాను
ఆవిష్కరించుకున్నాడు
తన గతికి పురోగతికి
మూలం మార్పేనని రూఢీ
పరుచుకున్నాడు
మార్పు సార్వజనీనసం
ఒక సార్వత్రిక సత్యం
కొత్తగా చిగురించే పుష్పం
కాల సూత్రానికి కట్టుబడి ఫలంగా
మారుతూ వుంటుంది
ఫలం తననుతాను సమర్పించుకుని
మరో వృక్షంగా మారి ఫల
పుష్పాదులను జగతికందిస్తుంది
పంచభూతాలు అంతసూత్రమై
కాలసూత్రానికి అనుబంధమై
ప్రపంచాన్ని అలరిస్తాయి
మనిషి మనుగడ గతితార్కిక
సూత్రానికి నిబద్ధమై
నిత్య నూతనంగా భాసిస్తోంది
ప్రకృతి నిరంతరం మారుతూ
విశ్వ యవనిక పై కొత్త దృశ్యాలను
చూపుతుంది
మనిషి మాత్రం గతాన్ని మరువలేక
భవిష్యత్తును పట్టుకునేందుకు
పరిభ్రమిస్తున్నాడు
తనచుట్టూ తాను ఒక శకలంగా



# బాల్యాన్ని చిదిమేస్తున్న బడిహింస

- కరణం శ్రీనివాసులురెడ్డి
9493212454

*ఒకప్పుడు అన్నీ వుండి సత్యం కోసం, ధర్మం కోసం, సమాజం కోసం, సాటి మనిషి కోసం, విలువలు కోసం సర్వస్వమూ పోగొట్టుకున్న వారి గురించీ, దేశం కోసం ధన, ప్రాణాలను త్యాగం చేసిన మహాత్ముల గురించీ పాఠ్యపుస్తకాలు బోధించేవి. కానీ విలువలు తారుమారైనాయి. ఇప్పుడు ఏమీ లేక సున్నా నుండీ జీవితాన్ని మొదలుపెట్టి అంచెలంచెలుగానో, ఉన్నఫలంగానో బిలియనీర్లుగా ఎదిగిన వారి గురించి నేర్చుకొంటున్నాం. ఇప్పుడు వారే సమాజానికి మార్గ నిర్దేశకులు, ఆదర్శప్రాయులు.*

రోజు రోజుకీ పెరుగుతున్న మానవసంబంధాల్లోని డొల్లతనాన్నీ, వ్యవస్థలోని అస్తవ్యస్తతనూ, సంక్షోభాన్నీ, సంఘర్షణనూ ఈనాటి కవిత్వంలో కవులు దృశ్యమానం చేస్తున్నారు. ఈ నేపథ్యంలో నేటి విద్యావ్యవస్థలోని అమానవీయాతనూ, హింసనూ తెలుగు కవిత్వం ప్రశ్నిస్తోంది. విద్య పేరుతో హింసించబడుతున్న కోట్లాది బాలల తరుపున గొంతెత్తుతోంది. వారి వ్యదార్ధ జీవిత యదార్ధ దృశ్యాలను మన ముందుంచుతోంది. ఈ సందర్భంగా మార్కెట్ సంస్కృతిని నెత్తికెత్తుకున్న నేటి కార్పొరేట్ విద్యావ్యవస్థలో పెరిగిపోతున్న అమానవీయుత, హింస తెలుగు కవిత్వంలో ఎలా చిత్రించబడ్డాయో పరిశీలిద్దాం. దానికి ముందు విద్య-ప్రపంచీకరణ మధ్య సంబంధాన్ని చూద్దాం.

“పక్షి తన తోటి పక్షికి రెక్కలతో ఎగరడం నేర్పినట్టుగా, పులి తన బిడ్డకి పంజా విసరడం నేర్పినట్టుగా, మనిషి తన అమూల్య సారాంశాన్ని, తన మానవత్వాన్ని, తను ఏ మూలాధారం వల్ల తనని తాను మానవుడిగా గుర్తిస్తున్నాడో ఆ అత్యంత సారాంశాన్ని తన తోటి మనిషికి అందిస్తాడు. విద్య అంటే తరం మరొక తరానికి ఇలా జీవన సంస్కృతిని అందించడం” (కొన్ని కలలు కొన్ని మెలకులు-వాడ్రేవు చినవీరభద్రుడు).

ఎప్పుడైతే విద్య మార్కెట్‌కు అనుసంధానించబడిందో అప్పటి నుండే విద్యా ప్రణాళిక నుండీ మానవీయ, సామాజిక శాస్త్రాలు కనుమరుగవడం మొదలయ్యాయి. భారతీయ విలువలు, సంస్కృతి, సమాజం, మానవుడు, సాహిత్యం, కళలు అన్నీ విద్య నుండీ పక్కకు తప్పించబడ్డాయి. ఒకప్పుడు అన్నీ వుండి సత్యం కోసం, ధర్మం కోసం, సమాజం కోసం, సాటి మనిషి కోసం, విలువలు కోసం సర్వస్వమూ పోగొట్టుకున్న వారి గురించీ, దేశం కోసం ధన, ప్రాణాలను త్యాగం చేసిన మహాత్ముల గురించీ పాఠ్యపుస్తకాలు బోధించేవి. కానీ విలువలు తారుమారైనాయి. ఇప్పుడు ఏమీ లేక సున్నా నుండీ జీవితాన్ని మొదలుపెట్టి అంచెలంచెలుగానో, ఉన్నఫలంగానో బిలియనీర్లుగా ఎదిగిన వారి గురించి నేర్చుకొంటున్నాం. ఇప్పుడు వారే సమాజానికి మార్గ నిర్దేశకులు, ఆదర్శప్రాయులు.

మార్కెట్‌కు పనికిరాని మానవీయ శాస్త్రాలకు, సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిన పరిస్థితి దాపురించింది. ప్రభుత్వాలు కూడా ఈ కోర్సులకు దాదాపు చాపచుట్టేశాయి. చరిత్రను విద్యా ప్రణాళిక నుండీ తీసివేయడానికి చాలా ఏళ్ళ క్రితమే మన పాలకులు ప్రయత్నించిన దాఖలాలున్నాయి.

"ప్రపంచీకరణ అంటే విద్యావ్యవస్థ గమనం దిశ, నిర్మాణం ప్రమాణాలన్నింటినీ ఇక ముందు నుండి కార్పొరేట్ శక్తులు, మార్కెట్ వ్యవస్థ నిర్ణయించటంగా అర్థం చేసుకోవచ్చా? ఈ ప్రశ్నకు అవును అని సమాధానం చెప్పుకుంటే సమాజ వికాసానికి, మానవజాతి పురోగమనానికీ అత్యంతావశ్యకమైన విద్యాసముపార్జనకు మార్గనిర్దేశం చేసే విద్యావిధాన రూపకల్పనలో గానీ, లక్ష్యాన్ని నిర్దేశించడంలో గానీ మేధావులకు, విద్యావేత్తలకు, ఉపాధ్యాయులకు అభ్యుదయకరపాత్ర నిర్వహించే అవకాశం లేకుండాపోయింది. మానవ నాగరికతా ప్రస్థాన చోదక శక్తి అయిన విద్యను ప్రపంచీకరణ శక్తులు తమ స్వార్థప్రయోజనాలకి ఉపయోగించాలనుకోవటం ద్వారా దాని తాత్విక మూలాల్ని లక్ష్యాలనే సవాలు చేస్తున్నాయి" (అనిల్ సద్గోపాల్, ప్రపంచీకరణ-భారతీయ విద్య, పుట. 8)

**బడి ఒక అందమైన పూలతోట. పిల్లలు వారు వారుగానే సహజంగా ఎదిగి వికసించే చోటు. సహజమైన, ఆహ్లాదకరమైన, స్వేచ్ఛాపూరిత వాతావరణంలో పిల్లలు పొరులుగా ఎదిగే ప్రక్రియ అక్కడ మొదలౌతుంది.**

సహజమైన, స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలో మనిషి మనిషిగా ఎదగడానికి ఒక అవకాశం కల్పించేది విద్య అని విద్యాతత్వవేత్తల అభిప్రాయం. కానీ విద్యలో పెట్టుబడి ప్రవేశించిన తర్వాత అది తన సహజత్వాన్నీ, మానవీయ మూలాలను కోల్పోయింది. జీవితానికీ విద్యకూ మధ్యవున్న సంబంధం తెగిపోయింది. వారి అవసరాలకు అనుగుణంగా విద్యాప్రణాళిక మార్పుచేయబడింది. శాశ్వత విద్యాలక్ష్యాలు పుస్తకాలకే పరిమితమై తాత్కాలిక అవసరాలను తీర్చే కోర్సులు, డిప్లమోలు, సర్టిఫికేట్లకు గిరాకీ పెరిగింది. ఇందులో భాగంగానే కార్పొరేట్ గిరాకీని బట్టి కొత్తకోర్సు పుట్టుక రావడం, అవసరం తీరగానే ఆ కోర్సును మూసేయడం జరుగుతోంది. ఇప్పుడంతా విద్య పూర్తిగా మార్కెట్ డిమాండును బట్టి సరఫరా చేయబడుతున్న ఒక సరకు.

ఇప్పుడు విద్య కేవలం వ్యాపారం కాదు; మంచి లాభసాటి అయిన వ్యాపారం కూడా. అందుకే పారిశ్రామికవేత్తలు, రాజకీయనాయకులు సైతం పెద్ద సంఖ్యలో విద్యా కేంద్రాలు నెలకొల్పుతున్నారు. కొత్త కొత్త కోర్సులను అందంగా డిజైన్ చేసి ప్యాకేజీలు, ఆఫర్లు ఇస్తూ అంగట్లో సరుకులా అమ్ముతున్నారు. మార్కెట్‌లో పోటీ అనివార్యం. దానిని తట్టుకుని నిలబడడానికి, తమ సరుకులో నాణ్యతను ప్రచారం చేసుకోవడానికి చదువులో 'ర్యాంకు'ను తెరపైకి తెచ్చారు. దాంతో చదువొక ర్యాంకులాటైంది. ర్యాంకు కోసం జ్ఞానాన్ని సమాచారంగా మార్చారు. ఆ జ్ఞానాన్ని ముక్కలు ముక్కలుగా విడగొట్టారు. బట్టీపట్టడం, గుర్తుకు తెచ్చుకోవడమే చదువుకు గీటురాయిగా మార్చి వాటినే పరీక్షిస్తున్నారు. ఆ రాత పరీక్షలో మార్కులే విద్యకు ప్రమాణంగా పరిగణిస్తున్నారు.

ఈ కారణంగా విద్యార్థిలో సముచిత మనోవైఖరులు, సామాజికావగాహన, శాస్త్రీయ దృక్పథం, నిశిత పరిశీలన, ఊహాపరికల్పన, సైద్ధాంతిక అవగాహన వంటి సమున్నత విద్యాలక్ష్యాలు అంతా అక్కరకు రాని ఆదర్శాలుగానే పరిగణింపబడుతున్నాయి.

ఈ పర్యవసానంగా విద్యావిధానంలోనూ, విద్యాచర్యలోనూ అనేక విపరిణామాలు చోటు చేసుకున్నాయి. విద్య కార్పొరేట్ చదువుగా మారింది. అమానవీయత, హింస, అనారోగ్యకరమైన పోటీ విద్యావ్యవస్థలో ప్రవేశించాయి. దీనికంతటికీ ప్రత్యక్ష బాధితులు బాలలు. విద్యపేరుతో హింసకు గురికాబడుతున్న కోట్లాది బాలల తరపున తెలుగు కవిత్వం గొంతెత్తుతోంది.

బడి ఒక అందమైన పూలతోట. పిల్లలు వారు వారుగానే సహజంగా ఎదిగి వికసించే చోటు. సహజమైన, ఆహ్లాదకరమైన, స్వేచ్ఛాపూరిత వాతావరణంలో పిల్లలు పౌరులుగా ఎదిగే ప్రక్రియ అక్కడ మొదలౌతుంది. చదువు అందుకు దోహదపడుతుంది. ఒక మొక్క భూమిలో వేళ్ళూనుకొని కొమ్మలుగా సాగి, పూలుగాపూని, కాయలుగాకాసి భూమిపై నీడనిచ్చినంత సహజంగా ఒక బిడ్డ జీవిత ప్రస్థానానికి బడిలోనే తొలి అడుగుపడుతుంది.

కానీ మార్కెట్‌గా మారిపోయిన ఈ ప్రపంచంలో వారు అధికరేటుకు అమ్ముడుపోవడానికి ఒక పథకం ప్రకారం తయారుచేసుకున్న ప్రక్రియ పాఠశాల నుండే మొదలౌతుంది. ఇంగ్లీషు, మార్కులు, ర్యాంకులు, అభివ్యక్తి నైపుణ్యాలు (కమ్యూనికేటివ్ స్కిల్స్) అన్నీ కలగలిపి ఒక విద్యార్థిని డాక్టరుగా, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా, 'ఒక కార్పొరేట్ క్రీచర్'గా తీర్చిదిద్దే పని బడిలో వేసిన రోజు నుండే ప్రారంభమౌతుంది. జీవిత లక్ష్యాలకనుగుణంగానే విద్యాలక్ష్యాలు కూడా

మారుతాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో జీవితలక్ష్యం మారింది. దాంతో విద్యాలక్ష్యమూ మారింది. బాల్యం ఆ మార్పుకు మూల్యం చెల్లించు కోవాల్సివస్తోంది. అదే అత్యంత విషాదం. పిల్లలు చదవాలి. ఎదగాలి. ఎదిగి ఏ అమెరికాకో, ఆస్ట్రేలియాకో కనీసం సింగపూర్‌కో ఎగిరివెళ్ళిపోవాలి అని తల్లిదండ్రుల ఆశలు ఆకాశాల్ని దాటుతున్నాయి. అవి పిల్లల బాల్యంపై మోయలేని బరువు వేసి వాళ్ళ జీవితాలను బోన్‌సాయ్ బతుకులుగా మార్చేస్తున్నాయి. ఈ విషయాన్నే "బోన్‌సాయ్ బాల్యం" కవితలో వేంపల్లి రెడ్డి నాగరాజు అధిక్షేపిస్తున్నారు.

**"అందని ఆకాశానికి నిచ్చెనలేసి**
**ఆశల సౌధాలను నిర్మిస్తూ**
**మీ కలల బ్యాగుల్ని**
**వాళ్ళ భుజాలకి వేలాడదీస్తారు**
**మీ ఊహల్లో డాలర్ల వృక్షాలయ్యేందుకు**
**పసితనం క్లాస్‌రూంలో ఖైదీ అవుతుంది**
**మమతల ఎరువుతో ఆప్యాయతల పాదుల్లో**
**పెరగాల్సిన బాల్యం**
**ఉగ్గుపాల దశలోనే బొగ్గుపులుసు వాయువును పీలుస్తూ**
**మరుగుజ్జు వృక్షమవుతోంది"**

బడిహింసకు సమాజ ఆమోదం వుండటం కూడా బాల్యానికి ఒక శాపంగా పరిణమించింది. "దేవుడికైనా దెబ్బే గురువు", "బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా" వంటి సామెతలు, సూక్తులు పిల్లలపై హింసకు సమాజ ఆమోదాన్ని పెంచుతున్నాయి. దాంతో "ఇప్పుడు దెబ్బలు తిని దారిలోకొచ్చి చదువుకుంటే రేప్పొద్దున వారి జీవితమే గదా బాగుపడేది" అనే భావన ఎక్కువ తల్లిదండ్రులలో వుంది. అందుకే అమ్మానాన్నలే స్వయంగా "సార్ నాలుగు తగిలించండి, ఏం ఫరవాలేదు. ఎలాగైనా సరే మా వాడికి మంచి ర్యాంకు రావాలి" అని పిల్లల్ని కొట్టడానికి ఉపాధ్యాయులకు భరోసా ఇస్తున్నారు. ఈ దృక్పథాన్ని "బాల్యం కూల్చివేత" కవితలో నాళేశ్వరం శంకరం ఇలా నిరసిస్తున్నారు.

**"చేప పిల్లల్లాంటి పిల్లలమే**
**బడిలో మమ్మల్నీ చేపల చెరువులో వాటినీ**
**విడివిడిగా పెంచుతున్నా మా కన్నా అవే నయం**
**... ... ... ...**
**మేం స్కూలు బ్యాగులు మోయడానికే పుట్టాం**
**కొట్టని తల్లిదండ్రులు తిట్టని ఉపాధ్యాయులు**
**మాకైతేలేరుగదా**
**మా పెంపకమంతా మీ అధీనంలో ఉందనేగా**
**రోజూ తోలు బొమ్మల్లా ఆడమంటారు**
**... ... ... ...**
**మేమేమైనా వాయుపుత్రులమా**
**సంజీవ పర్వతాన్ని మోపినట్టు ఈ మోత బ్యాగుల్ని**
**మోయడానికి**
**హృదయం గాలే విద్య ఉన్నా వొకటే ఊడినా వొకటే"**

పుస్తకాల మోత, పాఠశాలలో కార్పొరేట్ పనిష్మెంట్లు భౌతికహింస అయితే, హోంవర్కులూ, పరీక్షలూ, ర్యాంకుల పోటీలు మానసిక ఒత్తిడి. ఈ తొక్కిడిలో పరుగెత్తాలి. ముందుండాలి. ప్రతి ఒక్కడూ తనకు పోటీనే. నిలకడ లేదు. విశ్రాంతి లేదు. పసి వయసులో చదువులో బిజీబిజీ. ఊపిరి సలపని పని. ఇందులో నుండి బయటపడే మార్గంలేదు. అమ్మా నాన్నా బంధువులూ అందరూ కనీస కనికరం లేక అందులోనే తోసేస్తున్నారు.

బిడ్డ కడుపున పడంగానే కాన్వెంటులో సీటు రిజర్వు చేస్తున్నారు. భూమిపై పడగానే 'డే కేర్ సెంటర్'లో పడేస్తున్నారు. ఈ ప్రపంచీకరణ కాటేయబడిన బాల్యం గూర్చి యం.వి.జె.భువనేశ్వరరావు "కాటేయబడిన బాల్యం నీడన" కవితలో ఇలా ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

**"నాన్నా.....ఏంటిది?**
**ప్రత్యక్షంగా జీవన గమనంలోకి నెట్టేశావ్ నన్ను**
**పుడమిపైకి వచ్చిన సంవత్సర కాలానికే**
**శిశుగృహంలో నన్నుంచి**
**అమ్మా నువ్వు సంపాదన కెళ్ళేవారు**
**అమ్మ పొత్తిళ్ళలో కాకుండా**
**ఆయా 'బొమ్మరిల్లు'లోనే పసిప్రాయం పూర్తయిపోయింది**
**ఉన్నత చదువుల భవనానికి**
**బలమైన పునాదులుండాలనీ**
**ఎ,బి,సి,డీల నుండే ఐఐటి లెక్కలు నేర్పించావ్**
**పగలంతా బడిలో**
**రాత్రయ్యే దాకా గుడి ప్రక్కనున్న ప్రత్యేక బడిలో**
**నన్ను నిర్బంధ విద్యార్థిగా చేసి**
**నాకు అమ్మఒడి చిరునామా**
**తెలీకుండా చేశావ్"**

అమ్మలాలన, నాన్న భరోసా, తోడబుట్టిన వారి తోడి

జీవితం, బంధువుల అభిమాన పిలుపులూ వేటికీ నోచుకోని జీవితం నేటి బాలలది. ఆ జీవితాన్ని వారికి లేకుండా చేస్తున్నది వారి చదువులే.

కాబట్టే హాస్టళ్ళో దింపి బిడ్డను విడిచిపోతుంటే బిడ్డ ఏడ్చే ఏడ్పులను తల్లిదండ్రులు విన్నా, నీ కోసమే నేనీపని చేస్తున్నాను, ఓర్చుకో అంటూ నిర్దాక్షిణ్యంగా వదిలివస్తున్నారు. చేయి విడిపించుకువెళ్తున్న నాన్నకై చూసే చూపును ఏ గురువూ గుర్తించడు. ఏ దేవుడూ కరుణించడు. ఆ చూపుల్లోని ఆర్తినీ, ఆ ఏడుపులోని నిస్సహాయతని కవి అర్థం చేసుకోగలడు. రామాచంద్రమౌళి "చూపులు వెంటాడుతున్నప్పుడు" కవితలో అదే జరిగింది.

**"అంగట్లో అమ్మిన ఆవును అప్పజెప్తున్నప్పుడు దీనమైన**
**చూపులు వెంటాడ్తాయి**
**భాష చాలదు దుఃఖం గంగై పొంగుతుంది**
**ఏం చేశాను... మౌనంగానే కదా తలవంచుకుని నడుస్తూ**
**వెళ్ళిపోయాను**
**పాపను రెసిడెన్షియల్ హాస్టల్‌లో చేర్పించినప్పుడు**
**అప్పగించి వస్తూంటే మళ్ళీ అవే చూపులు**
**నాన్నా! నన్ను చదువు పేరుతో యిక్కడ బంధించడం**
**అవసరమా?**
**నేను ఇంజనీర్నో, డాక్టర్నో ఎందుకావాలి?**
**నేనొక ఉత్తమ మనిషినౌతా! అని గర్జించి ఏడుస్తూ**
**అడిగిన ప్రశ్న"**

ఇందులో ఆ తండ్రి ఎందుకు బిడ్డనలా నిర్దాక్షిణ్యంగా వదిలివెళ్తున్నాడు? ఉత్తమ మనిషినౌతానంటే ఎందుకు పట్టించుకోవడం లేదు?. కారణం మార్కెట్ మనస్తత్వం. ఉత్తమ మనిషి మార్కెట్‌కు అవసరం లేదు. మార్కెట్‌కు నైపుణ్యాలున్న మనిషి కావాలి. అతడెలాంటి వాడైనా సరే. అంతేకాదు మమతలకు, అనురాగాలకు దూరమైతేనే నైపుణ్యాలు సంపాదించుకుంటారని మార్కెట్టు వర్గాల అంచనా.

ఈ నైపుణ్యాల సంపాదన కోసం ఏ ప్రేమానురాగాలూ లేని హాస్టళ్ళు వెలిశాయి. అందులోని వ్యథాభరిత బాల్య జీవితాన్ని 'చదువుల జైళ్ళు' కవితలో వఝల శివకుమార్ ఇలా మనకళ్ళ ముందుంచుతున్నారు.

**"డార్మెట్రీ అంతా**
**కలలు అంటుకున్న కమురు వాసన**
**... ... ... ...**
**బోనులోంచి మరో బోనులోకి**
**మారుతున్న బతుకులో**
**స్వేచ్ఛ అర్థం దొరకని పదమౌతుంది**
**అమ్మ లాలనలకి**
**నాన్న ఆలనలకి**
**దూరంగా ఎదుగుతున్న**
**వాళ్ళ ఆప్యాయత**
**అనుభవంలోకి రాని**
**అనుభూతిగా మిగిలిపోతుంది**
**... ... ... ...**
**మఖ్యపెట్టి మమతలకి దూరం చేస్తున్న**
**చదువుల జైళ్ళు**
**పచ్చదనాలు కోల్పోతున్న**
**పసితనాల పచ్చిక బయళ్ళు"**

పిల్లవాడికి ఏ కళా లేకపోయినా ఫరవాలేదు. డబ్బు సంపాదించే కళ మాత్రం పుష్కలంగా వుండాలి. అందుకోసం ఏ కోర్సు చదవాలి? ఏ కార్పొరేట్ కాలేజ్‌లో చేరాలి? అక్కడ ప్యాకేజీలేమిటి? పెట్టుబడి ఎంత? ఆపై ప్లేస్‌మెంటులో జీతం ప్యాకేజ్ ఎంత? పెట్టుబడికి తగ్గలాభం వస్తోందా? లేదా? ఇవే ప్రశ్నలు. వీటికి సంతృప్తికర సమాధానాలు దొరికే కోర్సులో, కాలేజీలో ప్రవేశం. అంతా చిట్టాపద్దుల వ్యవహారం. పక్కా వ్యాపారం.

**"చదువులోని వెలుగుదారుల్ని తెరవాల్సిన**
**చదువు పుస్తకం నిండా రూపాయలకట్టలకట్టలు"**

అంటూ 'కొత్తపంట' కవితలో విద్యలోని వ్యాపారాన్ని జూకంటి జగన్నాథం ఎత్తి జూపారు.

విద్య వ్యాపారం కావడంతో విద్యార్థి–విద్య, విద్యార్థి – ఉపాధ్యాయుల మధ్య మానవీయ సంబంధాల స్థానంలో వ్యాపార సంబంధాలు నెలకొన్నాయి. చదువుతో మంచి జీవితాన్ని, విజ్ఞానాన్ని కాకుండా రూపాయలను కలగంటున్నారు. చదువుపేరుతో జరిగే ఈ వ్యాపారంలో బలిపశువు విద్యార్థే. ఆడుతూ పాడుతూ హాయిగా చదువుకోవాల్సిన వయస్సులో ఐ.ఐ.టి లతో, ఐ.ఐ.ఎం లతో ఎంసెట్ లతో గెలుపు కోసం యుద్ధం. ర్యాంకుల కోసం ఊపిరి సలపని పోరాటం. ఆ యుద్ధంలో విద్యార్థుల హాహాకారాలను

అదే కవితలో జూకంటి వినిపిస్తున్నారు.

**"ఏ రెసిడెన్షియల్ పాఠశాల దగ్గర**
**సెలవు ములాఖత్ చూసినా**
**జరిగిన ఘోర రైలు ప్రమాదం**
**హాహాకారాలు మిన్నుముడుతుంటాం**
**పిల్లల కన్నీళ్ళతో దేశం తగలబడిపోతుంది"**

బాధాకరమైన విషయమేమిటంటే ఆ హాహాకారాలు విన్న అమ్మానాన్నలు, గురువులూ ఇవన్నీ చదువు విషయంలో మామూలే, తప్పదన్నట్టు వ్యవహరించడం.

1959లో ఐక్యరాజ్యసమితి బాలల హక్కుల ప్రకటన (Declaration of rights of the Child) చేసింది. 1989 నవంబరు 20న ఐక్యరాజ్యసమితి "బాలల హక్కుల ఒడంబడిక" (Convention on the Rights of the Child)లో భారతదేశం కూడా సంతకం చేసింది. అయినా బాలల హక్కులు అన్ని విధాలా హరించబడుతూనే వున్నాయి. బాలకార్మిక వ్యవస్థలో బడి బయటి పిల్లలూ, విద్యాహింసతో బడిపిల్లలూ హింసింపబడుతూనే వున్నారు. ఈ హింసకు కారణాన్ని "చదువు-సరకు" కవితలో లలితా భీమయ్య తెలియజేస్తున్నారు.

**"అక్షరం అంగడి సరుకైనప్పుడు**
**అమ్మానాన్నల ఆకాంక్షల కోసం**
**పిల్లల ఆశల పత్రహరితాన్ని హరిస్తూ**
**వాళ్ళ స్వేచ్ఛా ప్రపంచంలో**
**మన ఆశల పిరమిడ్లు నిర్మించడం నేరం**
**పసిపాపల బాల్యాన్ని గోడల మధ్య బంధించి**
**ఆత్మీయత అనురాగాల్ని తాకట్టుపెట్టి**
**అందని ద్రాక్షలకోసం అర్రుల చాస్తున్నాం**
**కళ్ళముందే పసితనాన్ని ఘనీభవింపజేసే**
**కార్పొరేట్ కాలేజీ గేట్లకు ఉరితీసి**
**రేపటి స్వప్నాన్ని వీక్షిస్తూ**
**వారి ప్రాథమిక హక్కుల్ని అణచివేస్తున్నా"**

"కాన్సంట్రేషన్ క్యాంపు"ల్లాంటివి కార్పొరేట్ కాలేజీలు, వాటి హాస్టళ్ళు. వాటిలో విద్యార్థులు మమతానురాగాలకు దూరమై మానసిక ఒత్తిడికి, ఆందోళనకు గురౌతున్నారు. వీటికి కాస్తంత ఓదార్పు, సాంత్వనం దొరక్క, శారీరక అలసటకు కొంచెం విశ్రాంతి లేక బాల్యం అల్లాడుతోంది. ఈ బాల్యంతో తయారయ్యే భారతాన్ని మనం తేలికగానే ఊహించుకోవచ్చు.

యల్.కె.జీ లో చేరింది మొదలు అందరూ అడిగే ప్రశ్న ఒక్కటే "క్లాస్‌లో నీ ర్యాంకెంత?" మానవ సహజమైన మేథకు కృత్రిమ ర్యాంకుల లక్ష్యం నిర్దేశించి పిల్లలను తరుముతున్నారు. అమ్మానాన్నల స్టేటస్‌కు పిల్లల ర్యాంకులొక చిహ్నం. అన్నింటా మావాడే ముందుండాలి. అందుకోసం వాడేమైనా ఫరవాలేదు అనుకోవడంతో అందరిలోనూ పక్కవారితో పోలికలు, న్యూనతలు, ఆధిక్యతలు కమ్ముకున్నాయి. మన బిడ్డకెన్ని మార్కులన్న సంగతి అవసరంలేదు. మిగతా వారికంటే మనవాడికెన్ని తక్కువ? ఎన్ని ఎక్కువ? అన్నదే ప్రశ్న. ఈ భావననే "మోడ్రన్ మదర్" కవితలో హరిహల్వ అనిల్ కుమార్ ఇలా అధిక్షేపిస్తున్నారు.

**"తప్పినా బావుండేది ఈ వెధవ**
**బొత్తిగా తొంబై నాలుగుశాతం**
**తెచ్చాడు చేతగాక అంది ఏడుస్తూ**
**చూడండా సుబ్బారావుగారి అమ్మాయిని**
**తెచ్చింది మరి అయిదు మార్కులు ఎక్కువగా**
**ఎలా తల ఎత్తుకు తిరిగేది**
**ఎలా ఈ బాధను దిగమ్రింగేది**
**భరించలేని ఈ విషాదం**
**మరణమే ఇక శరణ్యం అంటోంది"**

ఇలా చదువులు పెద్దల పరువు ప్రతిష్ఠలకు చిహ్నంగా మారిపోయాయి. దాంతో పిల్లల జీవితంలోకి చదువు బలవంతంగానైనా కూరబడుతోంది. ఆ చదువంతా ఐ.ఐ.టి. మెడిసిన్, ర్యాంకులు, కంప్యూటర్, ఇంటర్ నెట్ ప్యాకేజీలతో నిండిపోయింది.

ఇవన్నీ ఇంట్లో వుండి చదువుకుంటే పొందలేదు కాబట్టి నగరంలోని హాస్టళ్ళలో వేస్తున్నారు. అక్కడ లాలించే అమ్మానాన్నలు, మార్గం చూపే గురువులు, ఓదార్చే స్నేహితులు, అలరించే ఆటపాటలు, సందడి చేసే సరదాలు, ఆనందాలు ఏమీ లేవు. ఉన్నదంతా గైడ్లు, కంప్యూటర్‌లు, ఇంటర్నెట్, బ్లాగ్స్, సెల్‌ఫోన్, ఐపాడ్, టాబ్స్, అంతా వస్తుజాలమే. మానవాంశ శూన్యం. ఈ పరిస్థితిని రామాచంద్రమౌళి "చెత్త ఊడుస్తున్న ఆమె" కవితలో దృశ్యమానం చేస్తున్నారు.

**"ఐ.ఐ.టీలు, పుస్తకాలు, ఇంటర్నెట్ బ్లాగ్స్**

**కంప్యూటర్ తెరపై ధారలు ధారలుగా చిక్కని కన్నీళ్ళు అక్షరాలు అలుక్కుపోతున్నాయి. పిడికెడు నిద్రకావాలి నిద్ర మాత్రలను మోస్తున్న సీసాలు దొర్లుతూ దొర్లుతూ తాండవిస్తున్న లోలకం"**

ఈ కార్పొరేటు కళాశాలలు, హాస్టళ్ళు విద్యార్థి జీవితంలో న్యూనతనూ, నిరాసక్తతనూ, యాంత్రికతనూ నింపుతున్నాయి. చదువుకోసమే అమ్మానాన్నలు ఇంటి నుండి పంపేశారు. ఇక్కడ కేవలం చదువు మాత్రమే చెబుతున్నారు. ప్రతిక్షణం పోటీలోకి నెడుతున్నారు. ఉదయం 4 గంటల నుండీ రాత్రి 12 గంటల వరకూ కేవలం పాఠాలు వినడం, బట్టీ పట్టటం, పరీక్ష రాయడం, ర్యాంకు చూసుకోవడం అంతే. చదువంతా ఒక యుద్ధం. బడి ఒక యుద్ధరంగం.

ఈ విద్యా యుద్ధంలో చిక్కుకున్న ఓ విద్యార్థి యొక్క ఆవేదనను 'కెరటం' అనే కవి ఇలా మన ముందుంచుతున్నాడు.

**"అమ్మా మేం బతికే ఉన్నాం**
**యుద్ధరంగంలో-శత్రువు పర్యవేక్షణలో...**
**తమ్ముడూ! ఇక్కడ వీళ్ళూ**
**చదవడం కోసమే తినమంటున్నారు**
**చదవడం కోసమే బతకమంటున్నారు**
**చదవకపోతే చావమంటున్నారు**
**నాకు భయం వేస్తుందిరా!**
**ఇక్కడంతా నిశ్శబ్దం!**
**శ్మశాన నిశ్శబ్దం!!**
**శవాలు పుస్తకాలు పట్టుకొని తిరుగుతున్నట్టు**
**శవాలు మాట్లాడుకుంటున్నట్టు**
**శవాలు పాఠాలు చెపుతున్నట్టు"**

యుద్ధం మిగిల్చేది చావును, శ్మశానాన్నే. శ్మశానం లాంటి బడిలో ఉపాధ్యాయులు కూడా శవప్రాయులుగా పాఠాలు చెబుతుంటారు. పాఠం చెప్పడం మనసుకు సంబంధించిన అంశం. విద్యార్థి ఉపాధ్యాయుల మధ్య మానవీయ సంబంధాలున్నప్పుడు మాత్రమే పాఠం జీవంతో విద్యార్థుల జీవితాల్లో ప్రవేశిస్తుంది. కాని ఇక్కడదేమీ వుండదు. ఉపాధ్యాయులకు విద్యార్థుల పేర్లు కూడా వారికి తెలియవు. కేవలం వారు సమాచారాన్ని చేరవేసే యంత్రాలు మాత్రమే.

దీని వల్ల విద్యార్థి పూర్తిగా ఒంటరివాడవుతాడు. ఒత్తిడి లోనూ, గందరగోళం లోనూ, ఘర్షణ లోనూ అమ్మానాన్నల, గురువుల ఆత్మీయ స్పర్శ, ఊరడింపు, సలహా, ధైర్యం అతడికి అందదు. అంతిమంగా విద్యార్థి నాకెవ్వరూ లేరు అనే భావంతో ఆత్మహత్య చేసుకుంటున్నాడు.

చదువులు మార్కెటింగ్ చేయబడుతున్నప్పుడు అక్కడ అనివార్యంగా పోటీ నెలకొంటుంది. నిలదొక్కుకోవడమా? నిష్క్రమించడమా? అన్న జీవన్మరణ సమస్యగా చదువు మారిపోయింది. దాంతో పిల్లలపై విపరీతమైన ఒత్తిడి ఏర్పడుతుంది. తన చదువుపైనే కుటుంబ గౌరవం ఆధారపడి వున్నట్లు, దానిని కాపాడలేకపోతే తనకు బతికే అర్హత లేనట్లు విద్యార్థి అనుకుంటాడు. అంతేకాదు, ఇప్పుడు దిగువ మధ్య తరగతి కుటుంబాలవారు సైతం సంపన్నులతో పోటీపడుతూ, స్తోమత లేకున్నా కూడా నగరాల్లో ఖరీదైన కోర్సుల్లో, కాలేజీల్లో పిల్లల్ని చేర్చుతున్నారు. ఇందుకోసం లక్షల అప్పులు చేస్తున్నారు. పిల్లల చదువుకోసం ఏకంగా కుటుంబాన్నే ఒడ్డుతున్నారు. ఇదంతా పిల్లలపై విపరీతమైన ఒత్తిడి పెంచుతోంది. సత్తాలేకున్నా సరే పరుగెత్తాల్సివస్తోంది. వెనుకబడిన విద్యార్థుల గుండెల్లో ఊపిరాడని ఉక్కపోత, అలసట, గెలవలేనేమోననే న్యూనత. అమ్మానాన్నల కలల్ని నెరవేర్చలేని అశక్తత, నిస్సహాయత, చివరకు ఓడిపోతున్నామనే దిగులుతో ఆత్మహత్య. "బతుకే కళ" అనే కవితలో దర్భశయనం శ్రీనివాసాచార్య ఈ విద్యాహత్యల వెనుక కారణాన్ని కవిత్వీకరిస్తున్నారు.

**"ఊళ్లో కాలేజ్ హాస్టళ్ళో**
**కుర్రాడొకడు ఉరిపోసుకున్నాడు**
**మిత్రుడితో అన్నాను**
**చదువు బతికించాలి కదా!**
**ఎలా చంపుతుంది అనీ"**

నిజమే జీవితానికి కొత్త రంగుల్ని అద్దాల్సిన చదువు మరణ శాసనాల్నెందుకు రాస్తోంది. చంపింది ఎవరు? సమాధానం అదే కవితలో దర్భశయనం శ్రీనివాసాచార్య ఇలా పేర్కొంటున్నాడు.

**"చదువులో అర్థంలేని పోటీ చంపింది**
**పోటీలో ఇమడలేక అతను బలి అని**
**పోటీల తొక్కిళ్ళలో**
**ఊపిరి కోల్పోతున్న అన్ని సున్నితత్వాల**

# హైకూలు

- మురళీ మోహన్ మల్లారెడ్డి
8861184899



నీటిబిందువులు
బోయీలై
తీగెను మోస్తున్నాయి

ఎండావాన
వర్షంలో తడవాలనుందేమో
సూరీడికి

కరెంటుపోయింది
ఇల్లు
ఒక నిశ్చల చిత్రం

సముద్రం ఘోషిస్తోంది
కెరటాలు
కవాతు చేస్తున్నాయి

పైన మబ్బులు,
నూతిలోకి తొంగిచేస్తూ
పాతాళంలోనూ మబ్బులే.

కీచురాళ్ళపాటలకు
చీకటీ, చెట్లూ
శ్రోతలు.

నింగి సంధించింది
మేఘాన్ని ఎక్కుపెట్టి
వర్షాన్ని.

చెట్లన్నిటికీ
పేర్లు వేరైనా
ఇంటి పేరొక్కటే – పచ్చదనం

వాలుకుర్చీ
వృద్ధాప్యాన్ని
స్వాగతిస్తూ

చలేసిందేమో,
మంచుదుప్పటి
కప్పుకున్నాయి కొండలు

చీకట్లో
నీడలు వెతుకుతూ
నేను.

కొవ్వొత్తి వెలుగుతోంది
కరుగుతున్నది
మైనమా? చీకటా?

❋

**నిశ్శబ్ద నిష్క్రమణ ఇదే!"**

చంపింది చదువుకాదు. చదువులోని పోటీ. మరి పోటీ ఎందుకు చంపింది? మార్కెట్‌కు కావాల్సిన మానవ సరుకును ఏరుకునేందుకు.

ఈ దృగ్విషయాల్ని మామూలు మనిషి చదువుకు సంబంధించి సహజమైన అంశంగా పరిగణిస్తాడు. కానీ కవి హృదయం కలిగినవాడు అందులోని ఆంతర్యాన్నీ కుట్రనూ పసిగడతాడు. బయటపెడతాడు. కుట్రను బయటపెట్టేవాడు కవి. అంతేకాదు స్నేహితుడిలా భుజంపై చేయి వేసి మనలోని మానవత్వాన్ని తట్టిలేపుతాడు. మార్గం చూపుతాడు.

**“భాష చాలుతుందా అనుభూతి చెప్పడానికి**
**అరే! వ్యక్తి అంటేనే ఒక జీవితకాల వ్యక్తీకరణ కాదా!**
**చూపులు వెంటాడ్తాయి**
**అమ్మిన ఆవువి హాస్టల్లో చేర్పించిన బిడ్డవి**
**తప్పులు చేస్తావు మనిషివి కదా!**
**‘యు’ టర్న్ ఉన్నదందుకే పునర్...పునరాలోచన”**

ఇది ‘చూపులు వెంటాడ్తాయి’ కవితలో రామాచంద్రమౌళి రేకెత్తించే చైతన్యం, చూపించే మార్గం.

జీవితమంటే జీవితమే. దానితో చదువు, డబ్బు, హోదా ఏవీ సమానం కాదు. జీవితంలో దేనికీ పోలికా లేదు. జీవితాన్ని, జీవించడాన్ని నేర్పే విద్యను ప్రపంచీకరణకు అప్పగిస్తే “దెయ్యం చేతికి బిడ్డనిచ్చినట్టే”. విద్య జీవితమంత విశాలమైనది. జీవితమంత లోతైనది. విద్యలో వాణిజ్య విలువలు కూరబడితే అది మానవతా పరిమళాన్ని కోల్పోతుంది. చివరకు మనిషి మనిషిగా పతనమౌతాడు. ఆఖరుకు తనే ఒక సరుకుగా మారిపోతాడు. మనిషిగా పుట్టిన బిడ్డను సరుకుగా మార్చుకుంటామో, ఉన్నత మానవుడిగా ఎదగడానికి కావాల్సిన స్వేచ్ఛను, వాతావరణాన్నే కల్పిస్తాయో నిర్ణయించుకోవాల్సింది తల్లిదండ్రులే. ఈ దిశగా వారిని విద్యావేత్తలు, సామాజికవేత్తలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం చైతన్య పరచాల్సివుంది. ఇప్పుడు చూస్తున్న సామాజిక అసహనానికీ, హింసకూ, విశృంఖలత్వానికీ మూలాలు ఇంట్లోనూ, బడిలోనూ వున్నాయని అందరూ గుర్తించాలి. ఇంతదూరం ఒక మార్గంలో ప్రయాణించాం. పెడత్రోవన పయనిస్తున్నట్లు గుర్తించాం. రామచంద్రమౌళి అన్నట్లు ‘యు టర్న్ ఉన్నదందుకే పునరాలోచన’. ఆలోచన వస్తే ఆచరణా మొదలౌతుంది. ఆచరణే జీవితం.

❋

# అమ్మా.... ,



మెరాజ్ ఫాతిమా
9000173860

యుద్ధం అనివార్యం ,
కానీ ఆయుధమే సిద్ధం కాలేదు ,
అమ్మా , రా.... ముందుకు రా.... ,

✻

మానవత్వం కోసం , మమత కోసం ,
స్వచ్ఛత కోసం , నిశ్చత కోసం ,
నువ్వు చేసిన యుద్ధాలేవి ..?
పోరు లేకుండానే ఓటమిని అంగీకరించే ,
ఈ బానిసత్వం ఎక్కడి నుండి వచ్చింది ..?
ఉగ్గు పాల నుంచా..? మగ్గిన సంస్కృతి నుంచా ..?
బుగ్గయిన స్వేచ్ఛ నుంచా ...?

✻

అరె...
పశువు కోసం , పక్షి కోసం ,
శిశువు కోసం కసువు కోసం ,
భూమికోసం , బూడిద కోసం ఆకరికి ఇసుక కోసం కూడా యుద్ధాలే....,
ఎక్కడ తల్లీ.... నీ స్వేచ్ఛ ..?
ఎవడో ముక్కులో అత్తరు పోసుకొంటే ,
వాడెనుక పరిగెత్తే ప్రకటనకు దిగజార్చే ధైర్యం ఎందుకిచ్చావ్..?
ఇంకెవడో గడ్డం గీసుకుంటే ,
వాడి మగతనాన్ని మెచ్చుకొంటూ చెంప రాసే చపలత్వమా నీది ..?
సతివై, చితివై, మనోచింతవై ..... ,
అంక్షకూ, ఆకాంక్షకూ తలవంచిన వంచితవై...,.

✻

ఎందుకమ్మా ....
నీ కాళ్ల దగ్గరి స్వర్గాన్ని దాటిన పాపుల చెంత ,
ఒదిగి ,ఒదిగి
రాక్షస రతుల్లో, రక్కసి గతుల్లో....., హింస పడుతున్నావ్ ..?
చాలు , చాలిక ...,
అమ్మను అంగడి బొమ్మను చేసే అప్రకటితపు ప్రకటనలు ,
రద్దు కావాలి, అందుకు నువ్వే ముందుకు రావాలి .
ఈ అత్తరు వ్యామోహాలను అరికాలికింద తొక్కెయ్ ,
ఈ నెత్తురు వ్యాపారాలను ఎడం కాలితో తన్నెయ్ ,

✻

ఆడదంటే " మేల్ " విత్తనాల ఖజానా కాదు,
ఆడదంటే " ఫిమేల్ " నిషిద్ధాల ఖార్కానా కాదు.
అమ్మా..... నీవు ఆటబొమ్మల మేళం కావు
అమ్మా ..., నీవు జన్మల నిచ్చే దేవళం నీవు.

✻

# ముక్కుపుడక

- వహీద్‌ఖాన్
9441946909



కనపడని గాలి తెరచాపను తాకీతాకనట్టు ముద్దాడుతుంది. ముద్దుల్లో మునిగిన ఆ చాప ఏనుగుమల్లె నావను నిండుగ, మెల్లగా నీళ్లపై నడిపిస్తుంది. భూమంతా మిణుగురులతో నిండినట్లుగ గోదారి అలలు సాయం సూర్యునికి మెరుస్తున్నాయి. నావలో పడేసిన వలల్లో చిక్కిన చేపలను ఒక్కొక్కటి తీసి ఏ రకం చేపలను ఆ రకం బుట్టలో వేస్తోంది రత్తాలు. బుట్టలో వేస్తూ తలను వలకు, బుట్టకు మధ్య అటూ ఇటూ తిప్పుతుంది. ముందుకు పొడుచుకు వచ్చిన ముక్కుకు వున్న ముక్కుపుడక ఎండ కాంతికి మెరుస్తూ... ఆరుతూ... వుంది ఆ తిప్పటంలో. పుడక మెరిసినప్పుడల్లా మెరుస్తున్న అలల్లో కలిసినట్టూ కనిపిస్తుంది. ఇటు తిరిగినప్పుడు రత్తాలు ముఖం నిండుగ కనిపిస్తుంది.

''ఏం..? రత్తాలూ... ముక్కుపుడకను ఎప్పుడుకొన్నావూ....?! ప్రశ్ననూ, ఆశ్చర్యాన్నీ, విచారణనూ ఒక్కసారిగా వెలిబుచ్చాడు మొగుడు గంగడు.

"ఎప్పుడేంటి..?! నిన్ననే...! సారా కొట్టుకాడా పతిరోజూ నీవు దాచుకున్న డబ్బుల్ని ఇప్పించుకొని కొన్నాలే...! ఏం...?!" రత్తాలు బుస్సుమంది.

ఏం.... లేదు మెరుస్తుంటేనూ....! గంగని సంజాయిషీ.

"మన పెండ్లి అయి పదేండ్లయినా... ఓ చిన్న బంగారు పుల్లను కొనిచ్చావా...?" ముక్కు, మూతి రెండు తిప్పుతూ అంది.

పెనిమిటి కోపం తెచ్చుకున్నదేమోనని రెండు కండ్లూ గంగని వైపు తిప్పి చూసింది. భార్య అంటించిన చురకకు నోరును కట్టేసి చేతుల్లోని పడవ తెడ్డులను తిప్పుతూ వున్నాడు. తిప్పుతున్న చేతులు బలిష్టంగ వున్నయి. గంగమ్మ ఒళ్లో బతుకు భారమైనప్పుడల్లా గంగమ్మే ఆదుకుంటుందని వానికి గంగరాజు అని పేరు పెట్టిండ్రు గంగిడ్ని కన్నోళ్లు. అతన్ని గంగడు, గంగ, గంగరాజులని ఒక్కొక్కరు ఒక్కోరకంగా పిలుస్తుంటరు.

"బుట్టనిండా... బంగారు తీగలు దొరికినా... ఒంటికి ఒక్క బంగారు పూసను కొనిచ్చావా...?! ఎప్పుడో చిన్నప్పుడు మా అమ్మోళ్లు ఇచ్చిన పుడకే ఇప్పటికీ..., ఇంకేం... ఇప్పిత్తవూ...? రెక్కలు అరిగేదాక నావను తోలుడూ... వచ్చిందసాంతం సారా కొట్టుకు తగలెయ్యడం. ఇంతేగదా..! నాను కొన్నం... నీవు అడగటం... సాల్లే సంబడం.." అంటూ చేతికి చిక్కిన రెండు చిన్న చిన్న బంగారు తీగ చేపల్ని గంగని

మీదకి ఇసిరింది రత్తాలు.



"పతిరోజూ... ఆ వంక ఈ వంకతో పొగట్టం.. దానికి ఉబ్బి నేను దూదిపింజలా ఎగర్టం.. నిండుకున్న మబ్బోలే వరాలు ఇవ్వటం నాకు తెల్దా ఏంటి...? నీ యవ్వారం అయినా... నేనెప్పుడైనా... వద్దన్నానా... లేకపోతే... తాగుడు తగ్గించుకో మామా... అని చెప్పటం" పడవ తెడ్డులు తిప్పుతూ కూర్చున్న భర్త దగ్గరికొచ్చి మోకాలుపై చేతులు పెట్టి అంది. గంగని కోపం సల్లగయింది.

"నాకూ తెల్దా ఏంటి..? నువ్వు కాదనవు రత్తాలూ..." ముఖంలో ముఖం పెట్టి ముద్దెట్టబోతూ అన్నాడు.

"అట్ట సూడు సూర్యుడు సూత్తావున్నాడు" గంగని ఎదపై రెండు చేతుల్తో ఎనక్కి దొబ్బి చేతిలో వలందుకొంది మళ్లీ.

"ఆయన.. అట్టా సూత్తానే వుంటాడులే... కష్టంల ఎప్పుడైనా ఆలించినోడా..?! దగ్గరికి వచ్చి ఆదుకున్నోడా..?! పగలంతా అందర్నీ అన్నిటినీ సూత్తా వుంటమే ఆయన పని. లోకమంతా వెలుగునిచ్చే సూరీడు మన జీవితాల్లో వెలుగు నింపాడా... ఏంటి..?! సూర్యునిపై కోపాన్ని వెళ్లగక్కిండు గంగరాజు.

***

ఏం... ముసలాయన లేవటం ఏమన్న వుందా..? లేదా.. అట్టానే పడుకునేదేనా..?! నులక మంచం మీద పడుకున్న గంగని నిద్రలేపింది రత్తాలు.

కళ్లు తెరిచి చూస్తున్న గంగని ముఖంల ముఖం పెట్టి దగ్గరగా అలా సూత్తా వుంది రత్తాలు.

"ఏంది... ఇందాక బుగ్గ చెంపలూ... ముద్దు ముద్దు ముఖమూ, ముక్కు వుండె..? ముక్కు ముక్కు పుడకతో మెరుస్తా వుండె. ఇంతల్నె చెంపలు ముడతలు పణ్ణాయి. ముక్కు వొత్తుకుపోయింది. మెరుస్తున్న పుడకా.. లేదు" అన్నాడు రత్తాలు కళ్ళలో సూత్తా...

కల గన్నావా..?! మావా..?! ఈ ముసలి వయసుల ముద్దూ... ముక్కూ.... ముక్కుపుడక కలలేంటీ..?! పక్కనే కూర్చుంది.

"కలలకు వయసుతో పనేం వుందీ..? నిద్ర కావాలి గాని..." చమత్కరించాడు. నిద్రలోంచి తేరుకున్నడు.

"కన్న కలలు సాలిద్దు గాని బ్యాంకుకు పోయి వృద్ధాప్యపు పింఛన్ డబ్బులు ఎత్తకరా పో... నిన్ననే అకౌంట్‌లో పడి వుంటయి" మంచానికి అడ్డంగా ఆనించి వున్న చేతి కఱ్ఱను అందించింది. ఈ కఱ్ఱే కొడుకై వుంది ఈ వయసుల. ఇప్పుడు పిల్లలే గనక వుండి వుంటే ఎంత బాగుండేది. చిన్న, పెద్ద పనుల్లకు ఆదుకునేటోళ్లు". ఆసరా లేని నిస్సహాయతను తలుచుకున్నడు.

"కాసిన ఒక్క కాయనూ ఆ గంగమ్మ తల్లే తీసుకుపోనాది వరదలల్ల. అట్టానే బతుకీడిస్తిమి" వరదలల్ల కొట్టుకొనిపోయిన కొడుకును తలచుకొని కండ్లను గంగతో నింపుకుంది రత్తాలు.

ఎడమ చేత్తో కొంగును అందుకొని కండ్లు తుడుసుకుంది. ముక్కూ... తుడుచుకుంది.

"ఇగ లెవ్వు లెవ్వు... ఎళ్లు" కుడి చేతిలోని బ్యాంక్ పాస్‌బుక్కునందించింది.

గంగరాజు కుడిచేతిలో కఱ్ఱందుకుని భూమికి గట్టిగా అదిమి ఎడమ చేతిని మంచానికి ఆనిచ్చి లేచిండు. దదమోకాళ్లు నొప్పులతో వున్నయి. వయస్సు మళ్లింది కదా.. రెండెందుకని మోకాళ్లు మళ్ళటం లేదు. ఇంతవరకు తలకింద వున్న కండువను భుజానికేసుకొని బయలుదేరిండు.

"వచ్చేటప్పుడు కొన్ని టమోటాలు, బియ్యం తీసుకొనిరా... అట్లాగే నీ బీపీ మాత్రలు మోకాలు నొప్పి మందులూ తెచ్చుకో. మరవ్వొద్దు ఇంట్లో ఏమీ లేవు. నీవు తెత్తెనే... వంట" కేకలేసింది రత్తాలు. రోడ్డు మలుపు దగ్గరికి చేరిన గంగనికేసి.

సరేనన్నట్లుగ వెనక్కి మళ్లి చూడకుండనే చెయ్యెత్తి ఊపిండు.

డబ్బుల కోసం బ్యాంకు దగ్గర పెద్దలైనే వుంది. లైన్‌లో నిలబడ్డడు. తనే చివర అనుకున్నడు. కాసేపటికే ఇంకొందరు వచ్చి ఎనక చేరారు. రెండు గంటలు అలాగే ముందుకు జరుగుతూ... జరుగుతూ క్యాష్ కౌంటర్ దగ్గరికి వచ్చిండు. పాస్‌బుక్‌లో వున్న ఫొటోను, గంగడి ముఖాన్ని పోల్చి చూసిండు. క్యాషియర్ ఫారంలో నింపిచ్చిన రెండు వేలనూ, పాస్‌బుక్కునూ ఇచ్చిండు. పొమ్మన్నట్లు సైగ చేసిండు క్యాషియర్. గంగడు కౌంటర్ ముందు నుండి కదిలిండు. క్యాషియర్ ఇచ్చిన నోటును చేతిలో పట్టుకున్నడు.

"కొత్త రెండు వేల నోటు తాతా.." అన్నడు. అక్కడి లైన్లను సరిచేస్తూ కాపలా వున్న సెక్యూరిటీ గార్డు.



రెండు చేతులతో నోటును పట్టుకొని కండ్లకు దగ్గరగా పెట్టుకొని చూస్తున్నడు. రెండు వేలు ఆకు పచ్చనిరంగులో అంకెలు కన్పిస్తున్నాయి. నోటు గులాబీ రంగులో అద్ది తీసినట్లుగా చిక్కగా వుంది. మెరుస్తుంది. నోటును వెనుకా ముందు తిప్పి చూసిండు. అప్పుడే పుట్టిన తన మొదటి బిడ్డను తండ్రి ఎత్తుకొని మురిసిపోతున్న ఆనందం గంగడిలో కనిపిస్తుంది. నోటు మందాన్ని చూసిండు. నోటును వంపులు వంపులు తిప్పిండు. ఒడ్డు మీద పడ్డ కొర్రమీను ఆడినట్టు ఆడుతుంది నోటు. నోటులో జీవం ఉట్టి పడుతుంది. ఆ మెలికలకు నోటు టపాటపా, పటా పటా.. అంటుంది. జాగ్రత్తగా పట్టుకొని బ్యాంకు నుండి బయటికి వచ్చిండు. దగ్గరలోని కూరగాయల బజారు చేరిండు.

"టమాటాలు ఎంతా..?" టమాటాలు అమ్ముతున్న దగ్గరికి వెళ్లి అడిగిండు.

"ఇరవై రూపాయలకు కిలో" సమాధానం రావటంతోనే తక్కువకు ఇవ్వు అంటూ ఏరి తక్కడలో వేసిండు. కిలో కావాలన్నాడు. తూచిన కిలో టమాటాల కవరును అందుకోబోతూ భద్రంగా దాచుకున్న రెండువేల నోటును చేతబట్టిండు.

"చిల్లర ఇవ్వు... అంత పెద్ద నోటును తీసుకొని నేనేం చెయ్యాలా..?! టమాటా వాని ఘాటు ప్రశ్న.

"నీ ఇరవై రూపాయల కోసం అంత చిల్లర నా వద్ద లేదు" అన్నాడు మళ్లీ.

అందియ్యబోతున్న టమాటాల కవరును వెనక్కు తీసుకొని పెట్టుకున్నాడు. నోటు మార్చుకొని ఇరవై రూపాయలిచ్చి తీసుకుపోమన్నాడు టమాటాలతను.

ఏమీ అర్థంకాని గంగడు అలాగే నిలబడి వున్నడు.

"పో.. పో.. అయ్యా..." గద్దించిండు టమాటాలతను.

"చిల్లర మీ దగ్గర ఎట్లా వుంటది...?!" సమర్థించుకుంటూ అక్కడి నుండి వెళ్లిండు గంగరాజు.

వెళ్తా... భుజం మీది కండువతో చెమటను తుడుచుకుంటూ టమాటాల్లె ఎర్రబడ్డ ముఖాన్ని చల్లబరుచుకున్నడు. ముందుకు అలా నడుస్తానే మందుల షాపు కనిపించింది. వేసుకున్న కత్తర బనీను జేబులో నుండి అయిపోయిన ఖాళీ మందుల పత్తాలను చేత పట్టుకొని షాపువాడికి చూయించాడు కావాలన్నట్లుగ.

"నా వద్ద రెండువేల నోటు వున్నది" చిల్లర లేని పరిస్థితిని ముందే చెప్పాడు. ఎక్కడ కోప్పడతాడోనని. షాపువాడు చిల్లర లేదన్నాడు. మందులూ ఇవ్వలేనన్నాడు.

"ప్రతిసారీ.. ఈ కొట్టుకే వస్తాను కాస్త చిల్లర చూసి ఇవ్వు బాబు. పుణ్ణెం వుంటది. మూడు రోజుల నుండి బీపీ మందుల్లేక వేసుకోలేదు" అన్నాడు వేడుకోలుగ.

"ఈ రోజుకి ఓ మాత్ర ఇస్తాను. రేపొచ్చి సరిపడ చిల్లరతో వచ్చి మిగతా మందులు తీసుకుపో" బదులిచ్చాడు షాపువాడు.

ఇచ్చిన ఆ ఒక్క మాత్రను జేబులో వేసుకున్నాడు. జేబులో పడిందా.. లేదా... అని తడిమి చూసుకున్నడు.

"ఇంటికెళ్ళి వేసుకుంటాను లే ఇప్పుడు నా దగ్గర నీళ్లు లేవు" కృతజ్ఞత చూయించి పక్కకు తిరిగాడు.

ఇంకొకతను రెండువేల నోటు ఇచ్చి పన్నెండు వందల రూపాయల మందులు తీసుకుంటుండగా చూశాడు గంగరాజు. షాపువాడు ముందే చెప్పాడు రెండు వేలకి తనకు కావలసిన ఎక్కువ చిల్లర ఇవ్వలేనని. అందుకే గంగడు ఏమీ అనలేకపోయిండు. ఎడమ వైపుకు మళ్ళీ చూసిండు. మరొకామె చేతిలో మరో రెండు ఐదువందల నోట్లున్నవి. చెల్లనివి. షాపువాడు తీసుకున్నడు. కావల్సిన మందులూ ఇచ్చాడు.

"చెల్లే నోటు నడవటం లేదు. సెల్లని నోటు పరుగులు తీస్తుంది. ఇదేమీ చిత్రం బాబూ" అంటూ మెట్లు దిగి వెళ్ళాడు. ఏమోలే ఒక రోజుకు కావల్సిన మాత్ర దొరికింది. రేపటి సంగతి చూద్దాంలేనన్న నమ్మకంతో కిరాణా కొట్టుకెళ్ళాడు.

రెండువేల నోటు చూయించి రెండు కిలోల బియ్యం అడిగిండు యజమానికి. బియ్యం అడగటమూ, నోటు చూయించటం ఒకేసారి అయ్యింది. ఇక్కడైనా చిల్లర దొరుకుతుందేమోనన్న ఆశ.

"ఏందయ్యో...?! మతిపోయిందా...?! చిల్లర ఎక్కడా దొరకదు. అదో ఆ బంగారు కొట్టుకెళ్లి గుంజి బంగారు కొనిరా... నోటు మారుద్ది. చిల్లర దొరుకుద్ది. అప్పుడు నీకు కావల్సిన బియ్యం కొందువు కాని" అన్నాడు. మాటల్లో

# పిలుపు

- ఉదయ్
9951979399



అలసిపోయావు కదూ!
పనివాడా ప్రియనేస్తుడా సోదరుడా
జవసత్వాల్ని ధారవోస్తూ
రక్తాన్ని చెమటగా చేసి చేసీ..

ఇలా వచ్చి నా పక్కన కూచో
గాలికొమ్మలతో జతకట్టి ఈ
నిప్పురవ్వలు చేస్తున్న నాట్యం చూడూ
ఎర్రని ఈ మంటలో చలి కాచుకుందువుగానీ
పుల్లల్ని కాస్త ఎగదోయనా!?

నీ చెమటలోని మెరుపును
వాడి షాండ్లియర్లలోకి తరలిస్తూ
నీ నెత్తుటివేడిని
వాడి చలిమర గదుల్లోకి తర్జుమా చేస్తూ
గుప్పెడు సుఖంకోసం
గుండెలోని శక్తినంతా గుమ్మరిస్తూ గుమ్మరిస్తూ

ఎంతలసిపోయావో చూడు
ప్రాణం కింద నల్లని వలయాలు
చుట్టూతా మురికి పేరుకుపోయి..

నేస్తుడా
ఈ చలిపూట నీకోసం ఒక పాట పాడనా?
ఎంతోకాలంగా హృదయాన్ని మెలిపెడుతూ రగిలిస్తూ
వెలిగిస్తూన్న
ఆ అరుణగీతం ఆలపించనా?
రేపుదయాన్నే తూరుపువైపు నడుచుకుంటూ వెళదాం,
నాతో వస్తావా?

❋

---

వెటకారం, అసహనం, ఛీదరింపు అన్నీ చూయించిండు షాపు యజమాని.

"బంగారం కడుపు నింపుద్దా... ఏంటి ఇవ్వరాదా... అయ్య బియ్యం" వినయాన్ని చూయించిండు గంగరాజు.

"పో... పో... వయ్యు...." గద్దించిండు. షాపు వాడి మాటలకు నొచ్చుకున్నాడు.

ఎంత పరిస్థితి వచ్చె.. అల్లుడి నోట్లో శని అంటే ఇదేనేమో అనుకున్నాడు గంగడు.

***

రత్తాలు గంగని రాక కోసం ఎదురుచూస్తూ వుంది. ఇంత సేపయిన ఎందుకు రాలేదబ్బా...?! ఎదురుచూపు రోడ్డు మలుపుదాక ఇప్పటికే రెండుసార్లు వెళ్ళి వచ్చింది.

"ఎలాగైనా... వస్తాడులే... సంద్రాన్ని, గోదారి వరదల్ని శిలగా నిలబడి ఎదుర్కొన్నోడు ఈ మాత్రం దాన్ని ఎదిరించలేడా...?! మెదడులో ప్రశ్నలు, సమాధానాలు, సమర్ధనలు ఉద్భవించినయి.

ఎదురుచూసి, ఎదురుచూసి గుడిసె లోపలికి వెళ్తున్న రత్తాలును...

"రత్తాలూ..." గట్టిగా అరిచిండు గంగడు.

వెనక్కి తిరిగి చూసింది. ఆయాసంతో పరుగులు తీస్తూ రొప్పుతూ వస్తున్నాడు. లగెత్తుకుంటు ఎదురుపోయింది రత్తాలు. చేతులు చాస్తూ రత్తాలు సమీపించింది.

"చూడు నీ కోసం ఏం తెచ్చాను?!" కుడిచేతి పిడికిల్ని తెరచి చిన్న న్యూస్ పేపరు పొట్లం ఇచ్చాడు. పొట్లం ఇప్పి చూసింది. చిక్కటి గులాబీ రంగులో తళతళ మెరుస్తున్న కాగితం. అందులో సన్నటి బంగారు పుడక. పుడకకి ఎర్రని రాయి కుదువబడ్డది. మెరుస్తున్నది.

రత్తాలు కళ్లు మెరిసినయి.

"అయినా... ఇప్పుడెందుకయ్యా ఇది. కావాల్సింది ఇంట్లో సరుకులు, నీకు మందులూ. ఎళ్తాంటే చెప్పినా గదా"

"ఎప్పుడో నీ కంటి ఆపరేషన్ కోసం పుడకను అమ్మినందుకు బదులుగా ముక్కుపుడక తెచ్చినవా...! నువ్వే ఓ బంగారు కొండవయ్యా...!" మొగుడి ప్రేమకు రత్తాలు ఏడుపుని ఆపుకోలేక పోతోంది. తనువు తీరా కౌగిలించుకోవాలనుకుంది. హత్తుకోబోయింది. గంగనికేసి చూసింది. కాని అప్పటికే నేలపై పడి వున్నాడు గంగడు. గుండె పగలినట్లయింది రత్తాలుకి. తనూ కూలబడింది. రెండు చేతుల్తో నిండా గంగడ్ని తడిమి చూసింది. కెరటం తాకిన బండరాయిలా సల్లంగయిండు.

❋




# తడియారని స్వప్నం- మనోవైజ్ఞానిక కోణం

- కెంగార మోహన్
9000730403

**జే**మ్స్ అలెన్ రాసిన **As a man Thinketh** పుస్తకాన్ని సుప్రసిద్ధ రచయిత్రి ఆచార్య మృణాళిని గారు **"మనిషంటే అతని ఆలోచనలే"** పేరుతో అనువదించారు. మనిషి ఆలోచనలమీద **నోమ్‌చామ్‌స్కీ** ఇప్పటివరకూ బాగా చెప్పాడనే నా ఆలోచనల్ని పటాపంచలు చేసిన పుస్తకమది. అందులో ఒక మాటంటాడు **" మన ఆలోచనలకు ఒక లక్ష్యమంటూ లేకపోతే అది తెలివైన ఫలితాన్నివ్వలేదు".** ఇది ప్రతి వొక్కరూ ఆమోదించాల్సిన మాట. సిగ్మండ్ ఫ్రాయిడ్ కూడా మనిషి బాహ్య, అంతర్గత అంత:ర్ప్రవర్తనలే కాక ఆలోచలనల్ని స్వప్నాల్ని, వ్యక్తిత్వాలను శాస్త్రీయకోణంలో మనోవిశ్లేషణా సిద్ధాంతం ద్వారా నిరూపించే ప్రయత్నంలో సఫలమయ్యాడు. ఈ సిద్ధాంతంలో మానవుని ప్రవర్తనను అతని మూర్తిమత్వం **(Personality)** తో వివరిస్తాడు. మూర్తిమత్వం వేరు, వ్యక్తిత్వం **(Individuality)** వేరు. వ్యక్తిత్వం మనిషి ప్రవర్తనాశీలాన్ని గుణాన్ని తెలియజేస్తే మూర్తిమత్వం అసలు ప్రవర్తన అంటే ఏమిటో వివరిస్తుంది. అయితే ఈ సిద్ధాంత ప్రభావం మతం, నీతి, సాహిత్యం, చట్టం, కళలు తదితర రంగాలపై బాగా పడిందని సమాజంలో గమనిస్తున్నాము. ముఖ్యంగా ఈ ఆధునిక ప్రపంచంలో చూస్తున్నాము. సాహిత్యరంగం **(Literature)** పరిశీలించి విశ్లేషించాలనే ఉద్ధేశ్యం. ఇటీవల కాలంలో ఒక పోలీస్ అధికారి లోసారి సుధాకర్ **(DSP)** తడియారని స్వప్నం చదివాను. మనోవైజ్ఞానిక కోణంలో మనో విశ్లేషణా సిద్ధాంతానికి అన్వయిస్తూ కవిత్వాన్ని చూడాలనుకుని, లోతైన దృష్టికోణం కవిత్వంలో ఎంతుందో సాహిత్య సమాజానికి పరిచయం చేయాలనే సంకల్పంతో విశ్లేషిస్తే...లోతుల్లోకి వెళ్ళకముందు శీర్షిక తడియారని స్వప్నం గూర్చి చెప్పడానికి ఫ్రాయిడ్ స్వప్నానికిచ్చిన నిర్వచనానికి ఏదైన సరిపోతుందా? అన్న పరిశీలన పరిశోధనాత్మకంగా చూడాల్సివుంటుంది. స్వప్నాన్ని నిద్రలోని మనోజీవితంగా ఫ్రాయిడ్ వర్ణిస్తాడు. నిద్రలో కూడా ఉద్దీపనలు **(Stimuli)** మనసుమీద పనిచేస్తుంటాయి. వీటికి మనసు చేసే ప్రతి చర్యలు స్వప్నాలు అన్నాడు. స్వప్నాలలో ఎక్కువభాగం దృశ్య సంబంధమైన చిత్రాలతో నిండివుంటాయి. ఆలోచన, సంవేదనల అంశం కూడా కొంత వాటితో మిళితమై వుంటుందని పేర్కొన్నాడు. కవి లోసారి సుధాకర్‌లోని తడియారని స్వప్నంలోని స్వప్నాలు, ఆలోచనలు ఆచరణాత్మక సందేశాలు, సందేశాత్మక సమాజ చైతన్య కెరటాలు. మనిషిని మరో కొత్త ప్రపంచంలోకి తీసుకెళ్తాయి. ఈ కవిత్వ స్వప్నంలో స్మృతి ప్రధాన భూమిక పోషించింది. ఎవరికైనా స్మృతి గొప్ప కవితా వస్తువు. కవిత్వం నిండా స్మృతులుంటాయి, ఆలోచనలుంటాయి, అనుభూతులుంటాయి, కల్మషంలేని మానవ సంబంధాలు, దిగజారుతున్న విలువలు కళ్ళకు

కట్టినట్టు స్వప్నిస్తాడు. మందు కవి దృష్టికోణం ఎంత పరిశీలనాత్మకంగా వుంటుందో గమనిస్తే....

*కాసింత ఆకాశం అవ్వనీయండి*
*అరచేతంత కరిమబ్బునవ్వనీయండి*
*నలుదిక్కులకు*
*నిండు మేఘమై నన్ను*
*పరచుకోనీయండి*
*చినుకై కురిసి*
*బీడుగుండెల్ని తడపనీయండి*
*పైరునవ్వనీయండి*
*పదిమందికి కడుపునింపే*
*అన్నమవ్వనీయండి*

పొలాలు బీడుగా మారటం చూశాం, గుండెలు బీడు అవ్వడమంటే ఎంత కవితాత్మకత ఎత్తుగడ, ఎంత సామాజిక చైతన్యం కవికుందో అర్థమవుతుంది. ఇది కవికున్న ఊహే కావచ్చు, నిఖార్సైన వాస్తవ జీవన చిత్రం కూడా ఇదే. ఈ కవిత్వంలో కవి ఎంతో తపన పడతాడు, ఒొక లక్ష్యం దిశగా నిర్బంధనలు లేని , అసమానతలు అగు పించని దిశగా అడుగులేయాలనుకుంటాడు, అన్వేషిస్తాడు. ఆవేదన వెళ్ళగక్కుతాడు. కొత్త సమాజం ఆవిష్కరించాలని కలలు కంటాడు. ఆ కలలు తడియారని స్వప్నాలవ్వాలనుకుంటాడు. మదిలో పేరుకుపోయిన చిక్కనైన దు:ఖాన్ని అక్షరాలుగా పేర్చే క్రమంలో అనుభూతులతో కవితానిర్మాణం చేస్తాడు. చాలా సాదా సీదాగా...

*పరిమళించి పరవశించి*
*పరితపించిన గతం నాది*
*ఒక్కో జ్ఞాపకం వందగాయాలై గుచ్చుకుంటుంది*
*ఘనీభవించిన గరళం నా వర్తమానం*

జేమ్స్ అలెన్ చెప్పినట్టు మనిషి నిత్యం పరిణామం చెందుతుంటాడు, వృద్ధి చెందుతుంటాడు. ప్రతి పరిస్థితి నుంచి అతను ఎంతో కొంత పాఠం నేర్చుకుంటాడు. ఇక్కడ లోసారి సుధాకర్ ప్రతి జ్ఞాపకం నుంచి పాఠం నేర్చుకుంటాడు. ఈ కవిత్వంలో ఎన్నో జ్ఞాపకాలను మదిలో పదిల పరచుకుంటాడు. అది వాళ్ళూరులో పని చేసే అయ్యవారు కావచ్చు, అతనింట్లో కొక్కానికి వేలాడే టెరికాటన్ చొక్కా కావచ్చు, అతని కళ్ళల్లో నిరంతరం ప్రతిబింబంగా వెలుగుతున్న వాళ్ళ నాయిన స్వరూపం కావచ్చు. ఇంకా చెప్పాలంటే వాళ్ళమ్మ భద్రంగా దాచుకున్న దాపుడుచీర కావచ్చు. ఇవన్నీ అధ్భుత కవితలుగా తడియారని స్వప్నంలో పురుడు బోసుకున్నాయి. ఒక సుందరమైన కలకనే వ్యక్తి, ఒక ఉన్నతమైన ఆదర్శాన్ని హృదయంలో నిలుపుకున్న వ్యక్తి ఏనాటికైనా సాకారం చేసుకుంటాడు. సుధాకర్ గారు అదే పని చేశారనిపిస్తోంది. ఈ కవితలో..

*నీవులేని ఈ జీవితం*
*మహాభయం*
*భయం నన్ను మహా సముద్రంలా*
*మింగుతుంది*
*నువ్వు మాత్రం*
*ఏడేడు సముద్రాల కావల*
*నాకై ఎదురు చూస్తుంటావు.*

కొలంబస్ ఒక కొత్త ప్రపంచాన్ని ఊహించినట్టు, బుద్ధుడు ఒక నిర్మలమైన సౌందర్యాన్ని ఊహించనట్టు, తనూ స్వప్నంలో అలాంటి ఊహలోకి ముందు తను వెళ్లాడు. తనూహించిన కొత్త ప్రపంచాన్ని స్వప్నంలో చూస్తాడు. అయితే తడి యారని స్వప్నం కవితలో వాస్తవాన్ని స్వప్నంగా మలిచాడు. వ్యాకరణ దృష్ట్యా ఈ కవితలోని శిల్పం విరోధాబాసాలంకారమైనప్పటికీ వాస్తవజీవితంతో మేళవించి కవిత్వీకరించారు. ఈ కవితలో..

*తలపుల్నీ ఇంటి తలుపుల్ని మూసి*
*ఆశల శ్వాసలకు గొళ్ళెం పెడతాను*
*కిటికీలు కర్టెన్లు వేసి*
*గాలి కూడా దూరనంతగా*
*నాకు నేను బంధీ నౌతాను*

ఇది విరహమే కావచ్చు, వైరాగ్యమే కావచ్చు, అనిర్వచనీయమున ప్రేమే కావచ్చు, కాని ఇది హృదయం కార్చిన అక్షరకావ్యం.. ఈ కవితలో సౌందర్యాత్మకత, లయబద్ధమైన కన్నీటి లయలను పలికించి విరహగీతాన్ని ఆలపిస్తుంది. ఇక్కడ కవి స్వప్నానికి వైవిధ్యమైన అర్థం చెప్పాడు. ఫ్రాయిడ్ చెప్పినట్టు స్వప్నానికి అర్థం చెప్పడంలో స్వప్న విషయాన్ని **(Dream Content)** కాక స్వాపి మూర్తిమత్వాన్ని, అతని సాంఘిక స్థాయిని, కుటుంబ సంబంధాలను పరిగణనలోకి తీసుకోవాలంటాడు. అలాగే స్వప్నం అనేది అచేతన ఆలోచనల విరూపణం **(Distortion)** అంటాడు. ఇక్కడిది నిజమేననిపిస్తోంది. ❋

# పాపాయి కల

- తమ్మెర రాధిక
9440626702



నిదుర పోని వెన్నెల
కోవెల ఎదురుగా వున్న కోనేట్లో
నిశ్చల చిత్రాలు గీస్తోంది!
కొమ్మల్లో దాక్కున్న గాలి గమనిస్తోనే వుంది
ఎలా ఒక్కసారిగా విజృంభించి చెదరగొట్టాలా అని !
గోపురం గూట్లోంచి గువ్వ ఘడియ ఘడియకూ
రెక్కల్ని టపటప మంటూ శబ్దిస్తోంటే
తంబూరా తీగలలో మెలి తిరుగుతున్న రాగం
కొలనులో చేపై పైకెగసింది నీటినల్లకల్లోలం చేస్తూ
వెన్నెలంతా ముద్ద కర్పూరంలా మండిపోయింది
కేదార రాగపు స్వరాల నిప్పు రవ్వలల్లె!
నిశ్శబ్దపు అంచులు మెరుస్తున్నాయి కళవళపడుతున్న
పరిసరాలకు సానపడుతూ
అదుగో అప్పుడే....
గుడి తలుపులు నెమ్మదిగా తెరుచుకుని బాటసారిగా మాదిరి
భ్రమలు వెల్లి విరుస్తో భగవంతుడు
అలంకారిక చిరునవ్వుతో,
మేని విరుపు పట్టు తాపితాలతో.
పుట్టిన్నాటి నుంచీ కంటి రెప్ప ఏమారలేదు
పురాణాలలో వర్ణించి రూప వైభవం ఏ విధంగా
చూస్తానో అన్న భయ భీతులతోనే కాలం వెళ్ళదీసానే గానీ
ఇలా....
నలువైపులా లేచి పడుతున్న రాగ తరంగాల నీడలలో
పొగమంచును ఆకాశంలో దాచుకున్న నిశ్శబ్దాన్ని
విచ్చదీస్తూ వస్తున్న ఆ మూర్తిని
ధ్యానంలో చూసాం
ధ్యాసగా చూసాం,
లిప్త కాలంలో కనుల ముందు నుంచి వెళ్ళిపోతూ కరిగిపోతూ
ఆ మూర్తి అమూర్త రూపం భూమండల మంతా పరుస్తూ
అదృశ్యమవడం !
ఎప్పటిలానే నడిరాత్రి దాటిన నిశ్శబ్దంలో
కోనేరు వెన్నెలనడుగుతోంది నాలో చిత్రాలు గియ్యగలవాని!
తంబూరా తీవెలు రాగాన్ని సరిచేసుకుంటున్నాయి
నీటి చేపలవ్వడం కోసం,
కలత నిదురలో సొక్కిపోయిన కలల పొత్తిళ్ళ పాపాయి
ప్రకృతిని కలకంటోంది

*

# మౌనం బద్ధలవ్వాల్సిందే

- దారల విజయకుమారి,
91771 92275

బంధాల కూర్పులో
ఎంపికలో.. పెట్టుపోతల్లో
వాలకంలో.. మాటల వాడకంలో
నడకలో.. నడతల్లో ముద్రలు
అంతెత్తున ఎదిగిన ఆశలపూలు
సోలిపోతాయ్...రాలిపోతాయ్
ఆమె ఆలోచనంటే..
నేరాలై దోషిని చేస్తాయ్
అప్పుడప్పుడు ఆపేక్ష...అక్కర
ఆవిర్భవిస్తూ.... అదృశ్యమైపోతూ
తప్పొప్పుల్లో మినహాయిస్తూ
మగాడి బుద్ధికి పరాకాష్ట అవుతుంది
ఆ మనసు వంకరల్లో
అతి రహస్యంగా అధిపత్యం దాగుంటుంది
నిర్జీవమో.. సజీవమో.. తెలియకనే
అల్లుకుంటూ....దొర్లుకుంటూ



గతుకుల దారుల్లో... లోతైన లోయల్లో
బతుకు నీడ్చేస్తూ
తన కళ్ళకాంతి వెల్లువలో
చీకటి కథలపై...వెతలపై
గెలుస్తూ..గెలిపిస్తున్నా.
అంతా టోకెనిజం
సరిగ్గా.... ఇక్కడే... ఇప్పుడే
..జీవనంలో
స్థైర్యాన్ని వెతుక్కుని
వొంపుకోవాలి........... నింపుకోవాలి
మోస్తూన్న సూడో స్త్రీత్వం
వారి డొల్లతనం
తన బేలతనం
తిరస్కరించి.. సంస్కరించాలి
పీక తెగినా... పెదవి విప్పాలి
మెరవాలి..కురవాలి....ఉరమాలి
ఇక వెక్కిళ్ళ శబ్దం విన్పించరాదు
కచ్చడాల నెవరూ తొడగరాదు
ఆవేదనల శేషం మిగలరాదు
మార్పు రావాల్సిందే
మౌనం బద్ధలవ్వాల్సిందే

*

# మానేపల్లి జీవిత రేఖాచిత్రణ

- డా॥ ఎస్. సత్యనారాయణ
9849416374




*1992లో హైదరాబాద్ తెలుగు యూనివర్శిటీలో "శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం ప్రజా సాహిత్యం' అనే అంశంపై సిద్ధాంత వ్యాసం సమర్పించి పిహెచ్.డి.డిగ్రీ పొందారు. విశాఖ జిల్లా యలమంచిలి పట్టణంలో 1974లో 'అవగాహన' పేరుతో ఆధునిక ఆలోచనా వీచిక అనే సాహిత్యోద్యమ సంస్థను స్థాపించి అక్కడే స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు*

**1960** నుండి చివరి వరకు కథా రచనలోనే గాక వివిధ ప్రక్రియల్లో తలమునకలుగా ఉన్న పేరెన్నికగన్న రచయితల్లో డా॥ మానేపల్లిని ప్రముఖంగా పేర్కొనవచ్చు. డా॥ మానేపల్లిగా పేరుగాంచిన రచయిత పూర్తిపేరు మానేపల్లి సత్యనారాయణ. తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో 1944 మే నాల్గవ తేదీన జన్మించారు. తండ్రి మానేపల్లి గున్నేశ్వరరావు. తల్లి సత్యశ్యామలాంబ. ఏడుగురి సంతానంలో ఈయన మొదటివారు. ఇతనికి రాజమండ్రి ఆర్యపురంలో తొలుత అక్షరాభ్యాసం జరిగింది. ప్రాథమిక విద్య ఒంగోలులోని ప్రభుత్వ బేసిక్ ట్రైనింగు స్కూల్లోను, మోడల్స్కూల్లోను, టెక్కలి బోర్డు హైస్కూల్లోను, తరువాత తూర్పుగోదావరి జిల్లా రాజోలు బోర్డు హైస్కూల్లోను, ఆ తరువాత రాజమండ్రి మున్సిపల్ హైస్కూల్లోను, ఎస్.ఎస్.ఎల్.సి. లోనికి వచ్చిన తరువాత తొలి నెలలో పశ్చిమ గోదావరి జిల్లా చింతల పూడి హైస్కూల్లోను, 1958 అక్టోబరు నుండి 1959 మార్చి వరకు శ్రీకాకుళం జిల్లా చీపురుపల్లి బోర్డు హైస్కూల్లోను చదివి ఎస్.ఎస్.ఎల్.సి ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తండ్రి వృత్తిరీత్యా బదిలీ కావడంచేత ఇన్ని ప్రాంతాల్లో ప్రాథమిక విద్య పూర్తి చేయాల్సి వచ్చింది.

అనంతరం కళాశాల విద్య విజయనగరం మహారాజ కళాశాల్లో జరిగింది. అక్కడ పి.యు.సి బి.ఎస్.సి పూర్తి చేసి ప్రభుత్వోగ్యంలో చేరారు. 1967లో ఇంగ్లీష్, తెలుగు, హిస్టరీ మొదలైన అంశాలతో బి.ఎ డిగ్రీ కూడా పూర్తి చేశారు. ప్రభుత్వోద్యోగంలో ఉండడం వలన 1972 లో ఎం.ఎ. ఇంగ్లీష్ ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. 1977 డిశంబరు చివర్లో గ్రేడ్ వన్ తెలుగు పండిట్నుండి జూనియర్ లెక్చరర్గా పదోన్నతి పొందారు. తరువాత 1985 మార్చిలో ప్రభుత్వ డిగ్రీ కళాశాల అధ్యాపకునిగి పదోన్నతి పొంది ప్రభుత్వ నిబంధనల ప్రకారం 1-1-96 నుండి రీడర్ స్థాయికి ఎదిగి 31-5-2002 లో శ్రీకాకుళం ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల్లో పదవీ విరమణ చేశారు.

1992లో హైదరాబాద్ తెలుగు యూనివర్శిటీలో "శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం ప్రజా సాహిత్యం' అనే అంశంపై సిద్ధాంత వ్యాసం సమర్పించి పిహెచ్.డి.డిగ్రీ పొందారు. విశాఖ జిల్లా యలమంచిలి పట్టణంలో 1974లో 'అవగాహన' పేరుతో ఆధునిక ఆలోచనా వీచిక అనే సాహిత్యోద్యమ సంస్థను స్థాపించి అక్కడే స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు. "అవగాహన" గ్రంథాలయం ఎందరో

విద్యార్థులకు, పట్టణ పౌరులకు ఉపయోగపడుతుంది. ఈ గ్రంథాలయంలో తెలుగు ఆంగ్ల సాహిత్యంతో పాటు ఎన్నో జర్నల్స్ కలిగి, అనేక సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ ఎందరో ప్రముఖుల ప్రశంసలను, మన్ననలను అందుకుంటోంది.

డా॥ మానేపల్లి వివిధ ప్రక్రియల్లో రచనలు చేశారు. అవి కవిత్వం, కథ, నవల, అనువాదం, వ్యాసం, సమీక్ష మొదలైనవి. ఇతని తొలిరచన 'కార్డుకథ' అయిన వేషాలు. ఇది 1960లో మద్రాసులోని "చిత్రగుప్త" పత్రికలో ప్రచురితమైంది. తొలిగేయం "డబ్బు విలువ" ఆంధ్రపత్రికలో ప్రచురితమైంది.

కవితాసంపుటాలు: 'వెలిగించేదీపాలు' (1969-70) రోణంకి అప్పలస్వామి గారికి అంకితం. 'మేనా' (1974) 'రోణంకివారి' ఒక్కమాట'తో. 'విశాఖపట్టం' (నగరకావ్యం) (1975 తొలికూర్పు, 1990 రెండవకూర్పు 2000 మూడవ కూర్పు) చలసాని ప్రసాద్ 'ముందుమాట'తో. 'మెదడుమొక్క' (1983) చెరబండ రాజుకు అంకితం. 'యోధుడా కౌగిలించి కోనీ' (1995) వెంపటాపు సత్యం గారికి అంకితం. 'కలలు నేల మీదికి' (2004)

నవలలు: రాజీ, ఆడవాళ్ళు పుట్టరు, మట్టివాసన, ఆక్రమణ, అమ్మమ్మ ఫొటో, కర్ఫ్యూ 'ఉజ్వల' (2001) నవలికలు: 'కాంతిరేఖ' (1981) సౌజన్య వారపత్రికల సీరియల్ నవల. 'ఆడబ్రతుకు' – మోపాసా ఫ్రెంచి నవలకు అనువాదం 'డా.జివాగో' – నోబుల్ బహుమతి పొందిన బోరిస్ పాస్తర్నాక్ రష్యన్ నవలకు అనువాదం 'జీవనహేల' (చుక్కాని), 'సౌందర్యకీల' (ఆంధ్రభూమి), 'ఆదర్శం – ఆచరణ' (జయశ్రీ), 'ఒక్కటేదారి', 'అనివార్యం' మొదలగు నవలలు పుస్తక రూపంలో రావలసి ఉన్నవి.

అనువాదాలు:'జ్యోతిబాఫూలే'(1993), 'భారతదేశ ఆర్థికాభివృద్ధి' (1999) అమర్త్యసేన్ పుస్తకానికి అనువాదం. 'రెండోసగం' (సెకెండ్ సెక్స్) (20000) సైమన్దిబువోకు అనువాదం. 'సామ్రాజ్య వాద ప్రపంచీకరణ' (2001) ఫిడెల్కాస్ట్రో ఉపన్యాసానికి అనువాదం. 'ఒరిస్సాలో బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలు' (2012).

ఇతర రచనలు: 'ప్రజలమనిషి (1974) ఏకాంకిక, రావి శాస్త్రి 'పోరాటపు మాట'తో. 'పారిస్ కమ్యూన్ – గుణ పాటాలు' (1995) వ్యాసాలు, విరసం ప్రచురణ.

'ఆదర్శ వివాహాలు – ఆచరణ' (1999) వ్యాస సంకలనం. 'తొందరెందుకు' (నాటిక). ఇలా అనేక ప్రక్రియల్లో రచనలు చేశారు.

1958-63 మధ్య కాలంలో విజయనగరం మహారాజ కళాశాల్లో చదువుతున్న రోజుల్లోనే రోణంకి అప్పలస్వామి ప్రభావం వీరిపై తీవ్రంగా పడింది. వీరి ద్వారా చాగంటి సోమయాజుల గారితో పరిచయం ఏర్పడింది. వీరిద్దరూ ఉత్తరాంధ్రలోనే ప్రముఖ సాహిత్యకారులు. డా॥ మానేపల్లి గారికి శ్రీశ్రీ, నారాయణబాబు, ఆరుద్ర తదితరులు చిరపరిచితులే. రోణంకి అప్పలస్వామి, చా.సోల ప్రభావం మానేపల్లి మీద దాదాపు 25 ఏళ్ళపాటు కొనసాగింది. అయితే 1970 తరువాత 'వి.ర.సం. ఏర్పడ్డాక మానేపల్లిపై దీని ప్రభావం నేరుగా పడింది. తరువాత క్రమంగా మార్క్సిస్టు భావ జాలంలోకి మళ్ళారు. వరవరరావు, శివారెడ్డి, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు మొదలైన ప్రముఖులతోనూ వీరికి సన్నిహిత పరిచయం ఏర్పడింది. ఈ పరిచయాల ప్రభావం వల్లనే వీరి రచనల్లో వస్తువు, నిర్వహణ, సంవిధానం, ప్రయోజనాత్మకత మొదలైన అంశాల్లో మరింత పరిణతి ఏర్పడింది. ముఖ్యంగా 'పులుసు తపేలా', 'ఆక్రమణ' మొదలైన కథలన్నీ కాళీపట్నం రామారావుగారే నేరుగా పర్యవేక్షించారని రచయిత పేర్కొన్నారు.

ఊహించి, కృత్రిమమైన పాత్రలను సృష్టించుకొని, కృతకమైన సంఘటనలతో రాసిన కథల్లో జీవం-జవం రెండూ ఉండవు. మానేపల్లి ఏ చిన్న రచన చేసినా, ఏ చిన్న కథ రాసినా అందులో సమకాలీన సాంఘిక వాతావరణం తప్పక ప్రతిఫలిస్తుంది. తను ప్రయాణం చేస్తున్న జీవితంలో తనకళ్ళ ముందు కనిపించిన పాత్రలనే తన కథల్లో చూపించారు. దీనిని బట్టి మానేపల్లి సృజించిన సాహిత్యం ఏ మేరకు సాంఘిక ప్రయోజనానికి, ప్రజాచైతన్యానికి, విప్లవ ఆచరణకు కట్టుబడి నడిచిందో అర్థం చేసుకోవచ్చును. నిన్నటి మహాకవి శ్రీశ్రీ మొదలు నేటి విప్లవ కవి వరవరరావు వరకు అందరితోనూ మానేపల్లిగారికి సన్నిహిత పరిచయం ఉంది. ఉత్తరాంధ్ర కథా రచయితలు రా.వి. శాస్త్రి, కా.రా. మొదలైన వారితోనూ సన్నిహిత పరిచయాలుండుటం మానేపల్లి కథా రచనకు ఒక విధమైన పట్టు, చేవ సమకూరాయని చెప్పవచ్చును. ఈ కారణం చేతనే కథారచనలో మానేపల్లి కృషి విస్తృత స్థాయిలో జరిగి వివిధ కథా సంపుటాలు వెలువడడానికి కారణమయ్యిందని చెప్పవచ్చును. చివరి శ్వాస వరకూ సాహిత్య కృషి చేస్తూనే 25-01-2017న తుది శ్వాస విడిచారు.

**(మే 4 మానేపల్లి జయంతి)**

❋

## చేనుగట్టు పియానో కవిత్వం




**ప్రసాదమూర్తి**

వెల : 100/- పేజీలు: 143

ప్రతులకు : 8499866699

కవిత్వానికి వస్తే నాకో చూపుంది. దానికెంత స్పష్టత ఉందో చెప్పలేను కాని... చూడాల్సిందేదో చెప్పగలను. రాయాల్సిందేదో రాసే తీరుతాను. ఒకరి ప్రాపకం కోసం కాదు అది నా జీవన వ్యాపకం కాబట్టి.

**- ప్రసాదమూర్తి**

## తియ్యని చదువు




పిల్లల కథలు

**వేంపల్లె షరీఫ్**

వెల : 120/- పేజీలు: 64

ప్రతులకు : 9603429366

'నా దారి ఇలా మొదలైంది' అని చెప్పడం కోసమైనా ఈ పుస్తకం వేయాలనిపించింది. మొత్తం 42 కథలుంటే వీటిల్లోంచి 22 కథలను ఎంపిక చేసి ఇదిగో ఈ పుస్తకం తెచ్చాను. ఏవో ఒకటీ రెండు కథలు తప్ప మిగతావన్నీ నేను పద్దెనిమిదేళ్ల వయస్సులో రాసినవే. ఈ విషయం ఒక్కటీ గుర్తుంచుకుంటే చాలు.. ఈ కథలు అందరికీ నచ్చుతాయి.

**- వేంపల్లె షరీఫ్**

## చినుకు దీవి కవిత్వం




**వెంకటకృష్ణ**

వెల : 100/- పేజీలు: 133

ప్రతులకు : 8985034894

వర్తమానమే రంగస్థలమై/ చరిత్ర నర్తనకు దృశ్యమవుతుంద్రి/ కాల కాలాల పాత్రలు / వెలసిన రంగులతోనో / పులుముకున్న వన్నెలతోనో / కొత్త హంగులే ప్రదర్శిస్తాయి. / దృశ్యంలో ప్రగతి పండుతుందో / సంప్రదాయమే జీవిస్తుందో / అవగతమయ్యే లోపు / ముగిసిన నాటకమై తెరపడుతుంది.

**- వెంకటకృష్ణ**

## అల్లూరి సీతారామరాజు




**వచన కవితా విప్లవ వీర కథా కావ్యం**

**అద్దేపల్లి రామమోహనరావు**

వెల : 150/- పేజీలు: 256

ప్రతులకు : 9949174059

ఈ అల్లూరి సీతారామరాజు వచన కవితా విప్లవ వీరకథా కావ్యంలో అడుగడుగునా దేశభక్తి నేపథ్యంగా వీరరసం పోషింపబడింది. సందర్భానుసారంగా రౌద్రరసం, కరుణ రసం కూడా ఉన్నాయి. సీత-రామరాజుల ప్రణయ వర్ణనలో శృంగార రసం కనబడుతుంది.

**- తంగిరాల వెంకట సుబ్బారావు**

## ఒక వీరుడు మరణించడు




**(స్వర్గీయ శ్రీ సోమసుందర్‌కు వ్యాస నివాళి)**

సంపాదకుడు: **శశికాంత్ శాతకర్ణి**

వెల : 80/- పేజీలు: 94

ప్రతులకు : 0866-2430302

కవిత్వ రచనతో పాటు సమాంతరంగా సాగిన విమర్శకుడిగా సోమసుందర్ సాహిత్య కృషికి నేపథ్యం ఇది. అచంచలమైన సాహిత్య ప్రేమ, నిరంతర కృషి, రచనా లగ్నత, దీక్ష ఆయనను నిత్య యౌవనుడిగా నిలిపాయి.

**- శశికాంత్ శాతకర్ణి**

## గంగాళం కవిత్వం




**పప్పుల రాజిరెడ్డి**

వెల : 30/- పేజీలు: 58

ప్రతులకు : 9652215043

పప్పుల రాజిరెడ్డి 'గంగాళం' మూడు వంతుల నీళ్ళు, ఒక వంతు నేలలాగా తెలంగాణ జీవజలం వున్న కవితలతో పాటు, మట్టివాసన పరిమళించే ఇతర కవితలతో వెలవడుతున్న సంపుటి. తెలంగాణ చరిత్ర సంస్కృతులు చోదక శక్తులుగా పనిచేసిన మలి ఉద్యమ కాలం కవులకు, కళాకారులకు బలమైన నేపథ్యాన్ని, పదునైన మాధ్యమాన్ని ఇచ్చాయి. అందుకే, తెలంగాణ కవి వ్యక్తిత్వ పరిణామంలో తెలంగాణ కవిత్వ రచన ఒక దశా విశేషం కాగలిగింది.

**- డా॥ అమ్మంగి వేణుగోపాల్**

## పద్య స్రవంతి

**ఎరుకలపూడి గోపీనాథరావు**

**వెల : 80/- పేజీలు: 106**

**ప్రతులకు : 9848293119**




గోపీనాథరావు గారు మంచి వచన కవి కూడా. వచనమై వన్నె తొడిగినా, పద్యమై పల్లవించినా ఆయన ధ్యేయం ఒక్కటే. సామాజిక సద్వర్తనను ప్రతిష్టించడం. మహాకవి శ్రీశ్రీ ఆయనకు స్ఫూర్తి. పతితులూ, భ్రష్టులూ, బాధా సర్పదష్టులూ- వీరితోనే ఆయన నేస్తం.

**- సిహెచ్.వి. బృందావనరావు**

## నాన్న కావాలి దీర్ఘ కవిత

**ఎస్. సుమిత్రా దేవి**

**వెల : 50/- పేజీలు: 48**

**ప్రతులకు : 7207550867**




'ఒక్క ఊపులో చదివించే శైలి, నిర్మాణం, నడక ఈ దీర్ఘకవితకు పరిపూర్ణతనిచ్చాయి. భాషలో, భావంలో స్పష్టత, రమ్యత దీనిని రసమయ కావ్యంగా రూపుదిద్దాయి. ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న సుమిత్రాదేవి ఇదివరలో 'నైవేద్యం' అనే కవితా సంపుటి తీసుకొచ్చారు. ఇప్పుడు మీ ముందున్న ఈ దీర్ఘకవిత ఆమె కవితాశక్తిని, సానుకూల దృక్పథాన్ని, సంయమనదృష్టిని తెలియజేస్తాయి.

**- గుడిపాటి**

## కాహాళిక పద్య ఖండికల సంపుటి

**విశ్వశ్రీ డా॥ పూసల రజనీ గంగాధర్**

**వెల : 120/- పేజీలు: 132**

**ప్రతులకు : 9290680605**




అన్ని వర్ణాలు, కులాలు, జనార్ధనుని అవయవాలని వేదాలు ఘోషించినా కవులు చాటి చెప్పినా మన సమాజం మారటం లేదు. నాటి నుండి నేటి వరకు రాజకీయ శక్తులు మారనివ్వటం లేదు. ఏమైనా సమాజానికి హితముపదేశించటం కవి ధర్మం కాబట్టి, గంగాధర్ గారు తమ ఆవేదనను, ఉపదేశాన్ని ఈ ఖండికలో వివరించారు. మొత్తం మీద ఇది కరుణ రసాత్మకమైన కావ్యం.

**- పింగళి వేంకట కృష్ణారావు**

## తెలంగాణ కథకుల కథాంతరంగం

**గోపగాని రవీందర్**

**వెల : 100/- పేజీలు: 95**

**ప్రతులకు : 9440979882**




ఈ ప్రసంగాల శీర్షికలూ, తొలి వాక్యాలూ గబగబ చదివినా ఇట్టే బోధపడుతుంది. సొంతం వింటున్నట్టుగా (రేడియోలో పెట్టిన ముచ్చట్లు కదా!) చదివితే ఎంచుకున్న ప్రతి కథతోనూ రవీందర్ మనసు పెనవైచుకొని రచయిత చిత్రాన్నీ, సాహితీ స్థానాన్నీ కథ నడకనూ, మనోగతాన్నీ, సామాజిక ఫలితార్థాలనూ అలతి మాటలతో, మక్కువతో ముందుంచిన తీరు మీ మెప్పు పొందుతుంది?.

**- సుమనస్పతి**

## తీరొక్క పువ్వు నానీలు

**తగుళ్ళ గోపాల్**

**వెల : 20/- పేజీలు: 44**

**ప్రతులకు : 9505056316**




'ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మా, తీరొక్క పువ్వొప్పునే గౌరమ్మా' అంటూ నా చిన్నతనంలో మా అమ్మ పాడిన బతుకమ్మ పాట ఇప్పటికీ చెవుల్లో ధ్వనిస్తుంది. ఒక్క పువ్వు కాదు. అనేక పుష్పాలతో తయారయ్యే బతుకమ్మ అందానికే అందం. ఒక సామూహిక చందం. గోపాల్ రాసిన నానీలు అంతే. జీవితంలోని అనేక పార్శ్వాలనూ, భావ వర్ణాలనూ ప్రతిఫలించిన కవిత్వ పరిమళాలను నానీలుగా మలిచిన నవప్రతిభాశాలి గోపాల్.

**- డా॥ ఎన్. గోపి**

## రాజహంసలు టింగుబుర్ర

**ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, సఫాయి బస్తీ, కొత్తగూడెం ఉపాధ్యాయినులు, బాలబాలికల సంపాదకత్వంలో**

**వెల : లేదు పేజీలు: 40**

**ప్రతులకు : 720750867**




ప్రభుత్వ పాఠశాలలో ప్రధానోపాధ్యాయినిగా ఉన్న ఎస్. సుమిత్రాదేవి నాయకత్వంలో ఉపాధ్యాయినులు, బాలబాలికలే సంపాదక వర్గంగా వెలువరించిన కథల పుస్తకం ఇది. చక్కటి బొమ్మలు కూడా ఆ స్కూల్‌లో చదువుతున్న బాలబాలికలే వేసారు. తాము విన్న కథల్ని సేకరించి పుస్తకంగా వేయడం అభినందనీయం. పిల్లల చేత ఈ పని చేయించడం మరీ అభినందనీయం. చక్కటి ఈ కథలను అందరూ చదవాల్సిందే.



# మనిషి ప్రత్యేకం

- లలితానంద్
9247499715

ప్రకృతి ద్వంద్వాల్లో - విద్వేషమా
నాదెపుడూ ద్వితీయమే, అననుకూలమే

సంకల్పిత, అసంకల్పిత
విద్వేషం విద్వేషమే
అసంకల్పితం అర్థరహితం
ఎపుడెవరిదైనా
విద్వేషం విద్వేషమే
ఎక్కడైనా విషం విషమే
వేరేదైనా ప్రాంతమేదైనా
విద్వేషం విద్వేషమే
సుహృద్భావ శిల్పాన్ని చిదిమేయడమే లక్ష్యం
కాలం, కారణం ఏదైనా
విద్వేషం విద్వేషమే
బ్రతుకు బాట బీటలుదీయడమే గమ్యం

వివేకాన్ని విస్మరించే విద్వేషంలో
స్థానాలు మారే శరీరంగాలు
కరుకైన మనిషిలో గరుకైన మాటలయ్యే విసర్జకాలు
సమస్త కాలుష్యకారకాలు
కార్పణ్య ప్రేరకాలు
తిరోగమన వాహకాలు

విద్వేషమంటే
కూర్చున్న కొమ్మనే నరుక్కోవడం
ఉంటున్న ఇంటికీ నిప్పంటించడం
నడిపించే సమాజ నావకు కోరి కంతపెట్టడం
స్వశరీరంలో ఓ కాన్సర్ కణం నాటడం
రక్తంలో ఉన్మాదం రంగరించడం
నిరంతరం పెరిగే ఉక్రోష, ఆక్రోశ బీజవాహం

దేహాన్నీ, సందేహాన్నీ, సందేశాన్నీ ద్వేషించే దహించే అహం
తమ అర్థాన్నే అసహ్యించుకునే మాటల ఊటలు

విచక్షణ వికాసరాహిత్యం, స్నేహ స్పృహరాహిత్యం
సంస్కార రాహిత్యం సైద్ధాంతిక-నైతిక రాహిత్యం
విద్వేష సాన్నిహిత్యం, విధ్వంస మిత్రత్వం
ప్రకృతిలో ప్రాణుల్లో మనిషికే ప్రత్యేకం
మంటల్ని మంటలతో ఆర్పలేము
కల్మషాన్ని కల్మషంతో కడుగలేము
ఆరోపణన్ని ఆరోపణలతో అణచలేము
విద్వేషాన్ని విద్వేషాలతో పోగొట్టలేము
'కంటికి కన్ను' అంటే అంధకారం మిగిలినట్లు
'విద్వేషానికి విద్వేషమే' అంటే
మిగిలేది విపరిణామం, వినాశనం

విష పన్నాగుల విద్వేష ఊబిలో
సమస్త సమస్యల శాశ్వత సమాధి
సామాన్యుల గోడుకు నిలువెత్తు ఘోరీ
యువత భవిత సహారా ఎడారి
అక్షర ఘోష అరణ్యరోదన
కారుణ్య వేదన అడవిగాచిన వెన్నెల
అవును. ఇది విద్వేషపు అరణ్యం
మానవతంటే దీని సమూల నిర్మూలనమే
విద్వేష రాహిత్యనిర్మాణమే పునరుజ్జీవనం

❋

అనంతపురంలో ఏప్రిల్ 30న జరిగే

# 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన' రాష్ట్ర సదస్సు బ్రోచర్ విడుదల




విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో ఏప్రిల్ 17న 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన' అనంతపురం రాష్ట్ర సదస్సు బ్రోచర్‌ను విడుదల చేస్తున్న సాహితీ ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి. చిత్రంలో ప్రజాశక్తి బుక్‌హౌస్ జనరల్ మేనేజర్ కె. లక్ష్మయ్య, సంపాదకురాలు కె. ఉషారాణి. సాహితీస్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్

'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన' పేరిట ప్రజాశక్తి బుక్ హౌస్, సాహితీ స్రవంతి, మరో 250 ప్రజా సంఘాలు సంయుక్తంగా ఈ నెల 30న అనంతపురంలో రాష్ట్ర స్థాయి సదస్సు నిర్వహించ నున్నాయి. భాషా సాంస్కృతిక శాఖ సౌజన్యంతో ఈ సదస్సును నిర్వహిస్తున్నామని సాహితీ స్రవంతి గౌరవాధ్యక్షులు తెలకపల్లి రవి తెలిపారు. ఈ సదస్సుకు సంబంధించిన కరపత్రాన్ని విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో ఏప్రిల్ 17న ఆయన ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పద్యాల ద్వారా ప్రశ్నించడం, ప్రతిఘటించడం నేర్పిన మధ్య యుగ మహాకవి వేమన అని కొనియాడారు. మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా, హేతువాద భావన ప్రస్ఫుటించేలా ఆయన పద్యాలు ప్రజలకు సుపరిచితమన్నారు. తెలుగు భాషపై పదును పెరగాలంటే వేమన శతకాలు చదవాల్సిందేనన్నారు. వేమన సాహిత్యంపై రాసిన 13 ప్రామాణిక గ్రంథాలను ఒకేసారి, అనంతపురం సదస్సు వేదికపై ఆవిష్కరిస్తామని తెలిపారు. ప్రజాకవి వేమన రూపకం, పాటలు, కళా ప్రదర్శనలు ప్రజానాట్య మండలి ఆధ్వర్యంలో ఏర్పాటవుతాయన్నారు. తెలుగు రాష్ట్రాల నుంచి వేమన పద్యాలపై పరిశోధనలు చేసిన వారు, యూనివర్శిటీల నుంచి పలువురు స్కాలర్లు, విద్యార్థులు, ప్రొఫెసర్లు సదస్సుకు విచ్చేస్తారని తెలిపారు. ప్రభుత్వం యోగి వేమన విశ్వవిద్యాలయాన్ని స్థాపించినా, వేమన పద్యాలపై సరైన పరిశోధన, కృషి సాగడం లేదన్నారు. విస్తృత స్థాయిలో వేమన సాహిత్య వారసత్వాన్ని ప్రచారం చేయాల్సిన అవసరముంద న్నారు. ప్రజాశక్తి బుకహౌస్ సంపాదకులు కె. ఉషారాణి మాట్లాడుతూ, ప్రజాకవి వేమన శతకాలు తెలుగు రాష్ట్రాల్లోనే కాకుండా, కర్ణాటక, తమిళ నాడుల్లో కూడా విస్తృత ప్రచారంలో ఉన్నాయ న్నారు. ప్రజల తరపున నిలబడి, సాంస్కృతిక పునరుజ్జీవనంలో వేమన కీలకపాత్ర పోషించారని చెప్పారు. సమాజంలోని హీన పరిస్థితులకు వ్యతిరేకంగా వేమన తన సాహిత్యం ద్వారా పోరాడారని తెలిపారు. ప్రజాశక్తి బుక్‌హౌస్ జనరల్ మేనేజర్ కె.లక్ష్మయ్య, సాహితీ స్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్ పాల్గొన్నారు.

## కవితల పోటీ

పాలపిట్ట-విమల సాహితీ సమితి, హైదరాబాద్ వారు సంయుక్తంగా కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఒక ప్రకటనలో తెలిపారు. ప్రథమ బహుమతి: రూ. 4000, రెండో బహుమతి: రూ. 2000, మూడో బహుమతి: రూ. 1000, మరో అయిదు కవితలకి రూ. 500. చొప్పున ప్రత్యేక బహుమతులు ఇవ్వబడతాయి. **నియమ నిబంధనలు:** కవితపై పేరు రాయవద్దు. విడిగా కవిపేరు, చిరునామా, ఫోను నెంబర్ హామీపత్రంపై రాయాలి. పోటీకి పంపించే కవిత అనువాదంకాని, అనుసరణ కానికాదని, ఏ పత్రికలోనూ ముద్రితం కాలేదని, ఏ ప్రసార మాధ్యమంలోనూ రాలేదని, బ్లాగుల్లోనూ, సోషల్ మీడియాలోనూ రాలేదని హామీపత్రంపై రాయాలి. ఒక్కొక్క కవి ఒక కవిత మాత్రమే పంపించాలి. కవితలు తిప్పి పంపబడవు. కనుక కవిత జిరాక్స్ కాపీ తమ వద్ద ఉంచుకోవాలి. కవితలపై న్యాయనిర్ణేతలదే తుదినిర్ణయం. ఎలాంటి సంప్రదింపులకు తావు లేదు. కవితలు పంపించాల్సిన చిరునామా: **పాలపిట్ట మాసపత్రిక,** ఫ్లాట్ నెం: 2, బ్లాక్-6, ఎంఐజి-2, ఏపిహెచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500044, ఫోను: 040-2767 8430, **palapittabooks@gmail.com.** కవితలు పంపించడానికి చివరి తేదీ: 31 మే 2017

# అనంతపురంలో ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన సదస్సు బ్రోచర్ ఆవిష్కరణ

అనంతపురంలోని లలిత కళాపరిషత్, మినీ కాన్ఫరెన్స్ హాలులో ఏప్రిల్ 2న 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సు' బ్రోచర్‌ను రాయలసీమ అభివృద్ధి వేదిక అధ్యక్షులు డా॥ గేయానంద్ ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రజలు మాట్లాడుకొనే భాషలో విప్లవాత్మక భావాలను వేమన ఆనాడే తన పద్యాల ద్వారా ప్రచారం చేశాడన్నారు. వేమన భావాలను ప్రచారం చేయడం ఈనాడు ఎంతో అవసరమని, ఏప్రిల్ 30న అనంతపురంలో జరిగే సదస్సులో అందరూ పాల్గొనవలసిందిగా విజ్ఞప్తి చేశారు. ఈ ఆవిష్కరణ సభలో డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, పి. కుమారస్వామి, మల్లెల నరసింహమూర్తి, డా॥ ప్రగతి, సావిత్రమ్మ, కృష్ణవేణి, డా॥ రాధేయ, జన్నే ఆనంద్, చంద్రిక, పవిత్ర, యమున తదితరులు పాల్గొన్నారు.



అనంతపురంలో ఏప్రిల్ 2న జరిగిన 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సు' బ్రోచర్ ఆవిష్కరణ. చిత్రంలో రాయలసీమ అభివృద్ధి వేదిక అధ్యక్షులు గేయానంద్, డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి. పి. కుమారస్వామి, డా॥ రాధేయ, మల్లెల నరసింహమూర్తి, జన్నే ఆనంద్, రియాజుద్దీన్, గుత్తా హరి, మధురశ్రీ తదితరులు ఉన్నారు.



కర్నూలులో ఏప్రిల్ 7న 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సు' బ్రోచర్‌ను విడుదల చేస్తున్న సాహితీస్రవంతి గౌరవాధ్యక్షులు తెలకపల్లి రవి. చిత్రంలో రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, పత్తి ఓబులయ్య, వి. పోతన్న, ఇనయతుల్లా, పి. విజయకుమార్, జంధ్యాల రఘుబాబు, కెంగార మోహన్, ఉద్దండం చంద్రశేఖర్, జయరాం, రాధశ్రీ తదితరులు ఉన్నారు.



నంద్యాలలో రామకృష్ణారెడ్డి పి.జి. కాలేజి ప్రాంగణంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన', అనంతపురం రాష్ట్ర సదస్సు బ్రోచర్‌ను విడుదల చేస్తున్న రామకృష్ణారెడ్డి విద్యాసంస్థల అధిపతి కృష్ణారెడ్డి. చిత్రంలో నంద్యాల సాహితీస్రవంతి బాధ్యులు మాదాల శ్రీనివాస్, పి. శ్రీనివాసులు, కార్యకర్తలు ఉన్నారు.



హైదరాబాద్‌లోని త్యాగరాయగానసభలో మార్చి 26న సాహితీ కిరణం నిర్వహించిన కార్యక్రమంలో రెక్కల సృష్టికర్త యమ్.కె. సుగమ్‌బాబుకి 'సిరిగాద నరసయ్య స్మారక సాహిత్య పురస్కారాన్ని' అందిస్తున్న కొలకలూరి ఇనాక్. చిత్రంలో కళా దీక్షితులు, పొత్తూరి సుబ్బారావు, గుదిబండి వెంకటరెడ్డి, రమణ వెలమకన్ని, పెద్దూరి వెంకటదాసు ఉన్నారు.



విశాఖ పౌరగ్రంథాలయంలో ఏప్రిల్ 14న జరిగిన అదపా రామకృష్ణ పుస్తకం 'సాహితీ ఉద్యమంలో కరదీపికలు' ఆవిష్కరణ సభ. చిత్రంలో సాహితీ కిరణం సంపాదకులు పొత్తూరి సుబ్బారావు, ద్విభాష్యం రాజేశ్వరరావు, ఇమ్మిడిశెట్టి చక్రపాణి, శిరేల సన్యాసిరావు, మాధవీ సనారా, రంగబాబు, రాయవరపు సరస్వతి ఉన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,

# గుడిపాటి వెంకటచలం

19.05.1894 - 04.05.1979



చలం సాహిత్యానికి కేంద్ర బిందువు స్త్రీ. స్త్రీ, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ లాంటి వ్యాస సంపుటాలు, ఓ పువ్వు పూసింది, కన్నీటి కాలవ లాంటి కథలు, మైదానం, బ్రాహ్మణీకం లాంటి నవలలు, పురూరవ, సావిత్రి లాంటి నాటకాలు అనేకం రాశాడు. ఈయన వస్తువు, శైలి కూడా ఆంధ్ర సాహిత్యాన్ని మలుపు తిప్పింది.

SHAITYA PRASTHANAM  RNI N0.APTEL/ 2004/18396  Postal Regd. No.H/SD/415/16-18
Date of Posting : 02.05.2017 ▪ Date of Publication: 27.04.2017





52



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A180 |
| పుస్తకం పేరు | CANTANO |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Praveen |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |